

# 'లోగుట్టు' పెరుమాళ్ళ కెరుక

శ్రీ వేముల పెరుమాళ్ళుగారు స్వతంత్రంగా ఆలోచించేవారు. 'లోగుట్టు 'లో వారు నేటి దేశ కాల పరిస్థితులను గూర్చి ధైర్యంగా వ్యాఖ్యానించ గలిగారు.

దేవులపల్లి రామానుజరావుగారు, అధ్యక్షులు ఆంధ్ర సారస్వత పరిషత్

శ్రీ వేముల పెరుమాళ్ళుగారు రాజకీయాల గురించి రాయడమే కాదు స్వయంగా రాజకీయాలలో మునిగితేలుతున్న వ్యక్తి. స్వతంత్ర అభ్యర్థిగా కరీంనగర్ జిల్లా రాయికల్ మండలాధ్యక్షునిగా గెలిచినవారు. వీరు రచించిన 'లోగుట్టు'లోని ప్రతి పద్యంలో నేటి రాజకీయాల పరిస్థితి స్పష్టంగా కనబడు తుంది. రాజకీయాలతో సంబంధం ఉన్న వారందరూ చదవదగిన పుస్తకం యిది.

విశాలాంధ్ర దినపత్రిక, విజయవాడ

'లోగుట్టు పెరుమాళ్ళ కెరుక' అని సామెత. అది దేవుడి సంగతి. ఆధునిక రాజకీయాల అంతరాంతరాలు తరచి చూసిన వ్యక్తి శ్రీ వేముల పెరుమాళ్ళు గారు. అందుకు సాక్ష్యం 'లోగుట్టు' రాజనీతి చతుశ్శతే.

డా. పి. మధుసూధన్ రావు, అసిస్టెంట్ డైరెక్టర్ ఆకాశవాణి, హైదరాబాదు.

వర్తమాన రాజకీయాల లోగుట్టు విప్పిచెప్పిన అభినవ వేమన శ్రీ వేముల పెరుమాళ్ళుగారు కుటిల మైన జటిలమైన రాజనీతిని అందరికి అర్థమయ్యేలా అరటిపండు వొలిచినట్లు చెప్పిన అపర చాణుక్యుడాయన.

పరిశ్రమవారపత్రిక, వరంగల్

ఆర్థిక రాజకీయ సామాజిక రంగాలను విషపూరితం చేస్తున్న వాటిలో ప్రధానమైనవి డబ్బు పదవి. వాటివల్ల కలిగే దారుణ దౌర్భాగ్య పరిస్థితులకు శ్రీ వేముల పెరుమాళ్ళు గారి 'లోగుట్టు' అద్దం పట్టింది.

ఆనంద బృంద

# కాలజ్ఞానం

## (ఫీచర్స్)



వేముల ప్రభాకర్



విరాట్ పబ్లికేషన్స్
బి-225 ఫస్ట్ ఫేజ్
వనస్థలిపురం
హైద్రాబాద్-500661

వెల రూ.25

# కాలజ్ఞానం (ఫీచర్స్)

రచన
వేముల ప్రభాకర్
వెల రూ. 15

ప్రథమ ముద్రణ: **10.6.1992**
ప్రతులు **1000**


అట్టవెనుక చిత్రము
శ్రీ కె. రాజయ్యగారి 'Risky life'
కవర్ డిజైన్: సుస్మిత వి

ప్రతులకు
రోహిత్ వి
విరాట్ పబ్లికేషన్స్
బి-225 ఫస్ట్‌ఫేజ్
వనస్థలిపురం
హైదరాబాద్-500661

లేదా
వేముల పెరుమాళ్ళు
మండలాధ్యక్షుడు
రాయికల్-505460
కరీంనగర్ జిల్లా

ముద్రణ
మనోరూప అఫ్‌సెట్ ప్రాసెస్
హైదరాబాద్

# నామాట

గౌ. శ్రీ మాచర్ల జగన్నాథంగారి సంపాదకత్వంలో వరంగల్ నుండి వెలువడిన పరిశ్రమ వార పత్రికకు నేను చాలా కాలం రెగ్యులర్ రైటర్‌ను. గీత పరిశ్రమ గురించి నేను రాసిన పెక్కు వ్యాసాలు అందులో ధారావాహికంగా వెలువడ్డాయి. అయితే అన్ని తరగతుల పాఠకులను ఆకట్టుకోడానికి ఒక ఫీచర్ రాయమని సంపాదకుల వారు నన్ను ప్రోత్సహించారు. నేను దానికి 'కాలజ్ఞాన ం' అని పేరు పెట్టి ప్రతివారం ఏదో ఒక సమస్య మీద రాసాను. సామాజిక, రాజకీయ, ఆర్థిక సాహితీ విషయాలెన్నో అందులో చోటు చేసుకున్నాయి. అవి పాఠకులకు నచ్చాయి కూడా. లెక్కకు మిక్కిలిగా వారు రాసిన ఉత్తరాల ఉత్సాహంతో ఆశీర్షిక దాదాపు రెండు సంవత్సరాల కాలం కొనసాగింది. అలా వెలుగులోకి వచ్చిన కాలజ్ఞానం ఫీచర్స్‌లో నుండి ఎన్నుకొన్న కొన్నింటిని మరోసారి చదివి, సవరించి వెలువరించిందే మీ చేతిలో మున్న పుస్తకం.

ఈ 20వ శతాబ్దంలో కూడా సమాజంలో నెలకొనివున్న కొన్ని దురాచారాలు మతమౌఢ్యం, స్త్రీల యెడ విచక్షణ, బలహీన వర్గాలకు జరుగుతున్న అన్యాయాలు, నాయకుల స్వార్థం, అధికారంలో నున్న వారి అవినీతి ఆశ్రిత పక్షపాతాలు నన్ను కదిలించాయి. నా అనుభవానికి వచ్చినవి, ఇతరుల ద్వారా విన్నవి, చదివి తెలుసుకున్న సంఘటనలు యితర విషయాలనే తీసుకుని సునిశిత హాస్య వ్యంగ్యాలతో సుతిమెత్తగా చెప్పడానికి ప్రయత్నించాను. అంతేకాని ఎవరినీ నొప్పించాలన్నది నా ఉద్దేశ్యం కాదు. పాఠకులు సహృదయంతో ఈ కాలజ్ఞానాన్ని చదివి తమ అమూల్యమైన అభిప్రాయాల్ని తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తక ప్రచురణకు తోడ్పడిన వారందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.



భవదీయుడు
వేముల ప్రభాకర్

బి-225, వనస్థలిపురం
హైద్రాబాద్-500661

# ముందుమాట

ఆధునిక యుగంలో కాలగమనం మనోవేగ సమానం. ఆ వేగాన్ని అంచనా వేయగలిగేవాళ్ళు చాల తక్కువ సంఖ్యలో ఉంటారని చెప్పక తప్పదు. ఆ వేగ ప్రవాహంలో కొట్టుకు పోయేవాళ్ళే బహు సంఖ్యాకులు. ఆ వేగంలోని మలుపుల్ని మెరుపుల్ని మరకల్ని తట్టి చూసి కాల స్వభావాన్ని ఒకింత అర్థం చేసుకునే వాళ్ళు కూడ చాలా అరుదు. అయితే నిత్య జీవితంలో ఆకాలపు నదరు అనుభవాల తీపినీ, చేదునీ వేరు చేసి చూపించే ప్రయత్నంలో సమాజ ప్రయాణాన్ని దాని గమ్యాన్ని పరీక్షించి, పరిశీలించగలిగి సైద్ధాంతికరణలు చేసేవాళ్ళని ఆయుగపు మేధావులుగా మనం పరిగణించవచ్చు.

ఇకపోతే ఏ సూత్రీకరణల సహాయం లేకుండానే, సమాజంలోంచి ఒక క్షణాన్ని, ఒక కణాన్ని, ఒక వెలుగుని, ఇంకొకచీకటిని వేరుచేసి, లేక జత చేసి, మౌఖికంగానో లేదా రచనా వ్యాసంగం ద్వారానో వాటన్నిటి స్వాభావిక తల్ని, అస్వాభావికతల్ని, ప్రాముఖ్యతల్ని లేక నీచత్వాన్ని గమనించే వాళ్ళు ఇంగిత జ్ఞానంతో 'అవర్ గ్లాస్' (Hour glass) లోని కాలపు ఇసుక రేణువుల్ని తూచే ప్రయత్నం చేసే ప్రాపంచీకులు. ఈ చివరి కోవకి చెందిన వ్యక్తిగా ప్రభాకర్ని నేను గుర్తిస్తాను. ఈయన కాలజ్ఞానం ఈ మధ్యకాలంలో, నిత్యమూ జరిగే విషయాల్లోదాక్కుని ఉన్న నిజాల్ని, వైరుధ్యాల్ని, వింతల్ని, విడ్డూరాల్ని మనోరంజకంగా ఎత్తి చూపించగలిగిన ఒక ప్రయత్న బాణం.

కవిత కనర్హమైన ఇన్సిగ్నిఫికెంట్స్ (insignificants) ఏవీ లేవని శ్రీశ్రీ చెప్పిన మాటని కాస్త పొడిగించి, వ్యాసార్హత లేని అనుభవాలు కూడ ఉండవని నిరూపించ సాహసించి, ఇంచుక సఫలీకృతుడైన వాడు ప్రభాకర్.

పాన్ డబ్బా దగ్గరి ఉమ్మివేతల్లో రాజకీయ నాయకుని కండువా మడతల్లో మరొక గొర్రెల కాపరి గొంగలి వెంట్రుకల్లో ఇంకొక ముగ్ధ ముక్కుపుడక నించి రాలిపడ్డ మెరుపురాయి జిలుగుల్లో కూడ ఫీచర్స్కి పనికొచ్చే సామాగ్రి ఉంటుందా అని సందేహించేవాళ్ళకి 'ఎందుకుండదూ' అని తిరుగు ప్రశ్న వేసి, దానికి సమాధానంగా ఈ కాలజ్ఞానపు రెఫ్లెక్షన్ల (Reflections) పరంపరని, పంపరపనస తొనల దొంతరలో మనముందు గుమ్మరించి ఏరుకొని ఆస్వాదించమంటాడు మా ప్రభాకర్.

హరినాథ్ పాలాస

రాజనీతి శాస్త్ర శాఖాధ్యక్షుడు వివేక వర్ధిని కళాశాల హైదరబాదు

# అంకితం



గౌ. శ్రీ మాచర్ల జగన్నాథం గారికి

Ex-M.L.A

అధ్యక్షులు

ఆం. ప్ర. గీత పారిశ్రామిక

సహకార ఆర్థిక సంక్షేమ

సంస్థ లి. హైద్రాబాద్

# పూలజల్లు

పరమనాస్తికుడైన గోరా గారొకసారి హైదరాబాద్ శాసన సభా ప్రాంతములో పూల మొక్కలను పెరికి వేసే కార్యక్రమం చేపట్టి అరెస్ట్ అయ్యాడు. దేశంలో పూలమొక్కలను ఎవ్వరూ పెంచవద్దు. వాటి స్థానంలో కూరగాయలను పండించాలన్నది ఆయనగారి సందేశం.

కూరగాయల ఉత్పత్తి పెంచడం మంచిదే కాని అందుకు ఏపాపమెరగని పూల మొక్కలను బలి చెయ్యాలా అని పూల అభిమానులంతా తెగ బాధపడి పోయారు. ఆమాట కొస్తే పూలను అభిమానించని వారెవరు. అపుడే కనులు తెరచిన పసికందు కూడా పూల అందచందాలకు పరిమళాలకు స్పందిస్తుంది. మూగ జీవాలు కూడా ఆకర్షింపబడతాయన్నది వాస్తవం. అన్ని వయసుల వారిని ఆకట్టుకునేవి పూలు. ఎప్పుడో ఒకప్పుడు పూలచే అలంకరించబడని స్త్రీ సిగలుండవంటే అతిశయోక్తికాదు. అసలు సిగే లేకపోతే అదివేరు విషయం. స్త్రీత్వానికి సంపూర్ణత నిచ్చేది పూలే. అవి లేని ఎండు సిగలు పాశ్చాత్య దేశాల్లో మామూలే. కాని భారతీయుల కళ్ళకు అవి ఎడారుల్లా కనబడతాయి.

మన దేశ సంస్కృతే పూలతో ముడిపడి ఉంది. పూలులేని పండుగకాని. శుభకార్యంగాని లేదు. పుట్టిన రోజు, పెండ్లిరోజు, ఈ రోజు ఆ రోజు అనకుండా అన్నింటికి మనం పూలు వాడుతూనే ఉంటాం. శోభనం గదిలో క్రొత్త దంపతులకు పూలు పలికే ఆహ్వానమే భావి పౌరులకు ప్రాణం పోస్తుంది. కుటుంబ సంక్షేమశాఖ వారు ఎన్ని ఉపాయాలు చెప్పినా పూలమత్తులో అవి మరచిపోతున్నారు దంపతులు. ఫలితమే సంవత్సరము నిండక ముందే యింటింటా ''కేరు కేరులు'' వినిపిస్తున్నాయి.

పూలమాలలు మెడలో పడాలంటే ఏదో ఘనకార్యం చెయ్యాలికదా. ఏం పర్వాలేదు మా ప్రభుత్వోద్యోగులకు ట్రాన్స్ఫరైనప్పుడు (ఫేర్‌వెల్ ఏర్పాటు ంటే) పూలమాలలు వేస్తునే ఉంటారు. ఇక రిటైర్‌మెంటప్పుడు ఎలాగూ తప్పదు. ప్రతి సంవత్సరం బర్త్‌డే జరుపుకొని ఇంట్లోనే పూలమాలలు వేసి కొని సంబరపడవచ్చు. పెండ్లి రోజు కొకటి వేసుకోవచ్చు. ఓపికుంటే విజయవంతమైన (సంసారంలో పెళ్ళాం మొగుళ్ళ కీచులాటలు మామూలే కాబట్టి వాటిని అపజయాలుగా పరిగణించకూడదు) వైవాహిక జీవిత మహో త్సవాలను ప్రతి పది సంవత్సరముల కొకసారి జరుపుకొనవచ్చు. సిక్‌స్టీ పూర్తి జరుపుకొని మరో పెద్ద మాలవేసుకోవచ్చు.

రాజకీయ నాయకుల విషయానికొస్తే వారికి పూలమాలల కొరత లేదు

గ్రామ పంచాయతి సర్పంచు మొదలుకొని, దేశ రాష్ట్రపతి వరకు అడపా దడపా మాలలు వేసుకుంటూనే ఉంటారు. పూలు తెచ్చి, మాలలు కట్టి వేదిక మీద కూర్చోబెట్టి మెడలో వేస్తె పామును వేసినట్లుగా ఆ మాలను వెంటనే తీసి ప్రక్కకు పెట్టడం చాలామందికి అలవాటు. పూలమాలల్లో బాంబులు అమర్చే టెర్రరిస్టు రాజకీయాలు రంగప్రవేశం చేశాక రాజకీయ నాయకులు బెదరిపోతు న్నట్లున్నారు. ముఖ్యంగా రాజీవ్‌గాంధి విషాద మరణం తర్వాత పూలమాల లకు రాజకీయాల్లో గిరాకీ తగ్గిందనే చెప్పొచ్చు.

రాజకీయ నాయకులు అప్పుడప్పుడు కొన్ని విచిత్ర నిర్ణయాలు చేస్తుం టారు. శ్రీ జలగం వెంగళరావు మంత్రి వర్గమనుకుంటాను. పూలమాలల విషయంలో ఒక కఠిన నిర్ణయం చేశారు. పూలమాలలు స్వీకరించడం సమర్పించడము బంద్ అన్నారు. ఎంత ప్రియతమ నాయకులు వచ్చినా సరే వెళ్ళి సలాము చేస్తాము కాని పూలమాలలు వేయమని ప్రతిన పూనారు. పూలమాలలు వద్దనే సరికి రాళ్ళు వేశారేమో ఆ నిర్ణయం ఎక్కువకాలం కొనసాగలేదు. గెలుపు పూలనే వరించింది. అసలు గెలుపుకు సంకేతమే పూలమాలలుకదా.

సర్వసంగ పరిత్యాగులకు కూడా పూలమీద ప్రేమ. బుద్ధ భగవానుడు పాటలీ పుత్ర నగరానికి వస్తుంటే భక్తులంతా ఆయనకు పూలు సమర్పించుకో వాలని కోరుకున్నారు. మండే వేసవిలో అన్నిపూలు ఎక్కడ దొరుకుతాయి తోటమాలి దగ్గరున్న ఒకే పువ్వుకోసం ఎందరో ధనవంతులు ఎగబడ్డారట. ఆమాలి డబ్బుకు లొంగలేదు. ఆ పువ్వు కొనడానికి వారంతా ఎందుకు ఆరాట పడుతున్నారో తెలుసుకొని ఏకంగా ఆ పువ్వును తానే బుద్ధ భగవానునికి సమర్పించుకొని తరించాడట.

కరుణశ్రీ మెత్తని మనస్సుకు పుష్పవిలాపం పద్యాలు తార్కాణం. ''నేనొక పూలమొక్క కడకేగి చివాలున కొమ్మవంచి గోరానెడు నంతలోన విరుల న్నియు జాలిగ నోళ్ళు విప్పి మా ప్రాణము తీతువాయనుచు'' బావురుమన్నా యని ఘంటసాల పాడుతుంటే కొమ్మనుండి పూలను తుంచడానికి కూడా మనసొప్పదు మరి.

ఇంతటి ఘన చరిత్ర కలిగిన పూలను ప్రస్తుతించడానికి ప్రతి సంవత్సరము ఢిల్లీలో పూల్‌వాలాలు, త్యోహార్‌లు జరుపుతారు. తెలుగుదేశంలోను ఉంది పూల పండుగ అదే బ్రతుకమ్మ పండుగ.

కొసమెరుపు: పెండ్లిలో వేసుకున్న పూలమాలే, మళ్ళీ జీవితంలో మాల వేసుకునే అదృష్టమే నాకు రాలేదురా అని ఒక తాతగారు మనవడితో వాపోయాడట. అదెంత భాగ్యం తాతగారు మీ అంతిమ యాత్ర రోజు నిలువెల్లా పూలమాలలతో అలంకరిస్తాం అన్నాడట కొంటె కుర్రాడు.

# చిత్త శుద్ధి లేని శివపూజలు

లంచగొండితనం మహాభారత కాలం నాటి జరాసంధునిలాంటిది. భీముడు జరాసంధున్ని ద్వంద్వ యుద్ధంలో ఎన్నిసార్లు చీల్చినా, ఖండించినా మళ్లీ చకచకా అతుక్కుపోయేవాడట. ఎన్నిసార్లు ఎందరు లంచగొండితనాన్ని ఖండించినా అది చచ్చిపోలేదు. శ్రీకృష్ణుడు గడ్డిపరకను చీల్చి, దాని ముక్కలు అటునిటు మార్చి జరాసంధున్ని భీముడితో అంతం చేయించగలిగాడు కాని లంచగొండితనాన్ని ఖతం చేయగలిగిన మహానీయుడెవరూ ఇప్పటికీ పుట్టినట్లు లేదు. ఎందరో ప్రధానులు, ముఖ్యమంత్రులు, అధికారులు దాంతో కుస్తీపట్టినా గెలవలేక పోతున్నారు.

పూర్వం ఒక రాజుగారు ఈ లంచగొండి తనం వెంటపడ్డారట. దాన్ని వెతికి పట్టుకున్న వారికి బహుమానాలిస్తామన్నాడట. సభా సదుల్లోనుండి ఒకతను లేచి "అయ్యా మీ దర్శనం కోసం లోనికి రావడానికి మేము ముందుగానే ముఖ్యద్వారపాలకునికి ముడుపులు చెల్లించుకున్నాం'' అన్నాడట. రాజుగారు ముఖ్యద్వార పాలకున్ని ఆ పదవి నుంచి తొలగించి సముద్ర తీరంలో అలలు లెక్కబెడుతూ కూర్చోమని శాసించాడట. పట్టువిడువని విక్రమార్కుడిలా ముఖ్యద్వార పాలకుడు సముద్ర తీరానికి వస్తున్న ఓడలన్ని ఆపించడం మొదలెట్టాడు. ఇదేమయ్యా అంటే ''రాజుగారు నన్ను సముద్రం మీద అలలను లెక్కబెట్టమన్నారు. మీ ఓడల రాకవల్ల ఆ అలలు చెదిరిపోతున్నాయి. కాబట్టి మీరు ఓడకింత మామూలు చెల్లించుకుంటే తప్ప తీరానికి రానిచ్చేది లేదు'' అన్నాడట అదీకథ.

నాటి ముఖ్యద్వార పాలకుడిలా తివిరి ఇసుకలో తైలంబుతీయవచ్చునేర కం వారు నేడు కూడ ఉన్నారు. గతంలో ముఖ్యమంత్రిగారొకరు మంత్రి వర్గంలోని ఒక మంత్రి అవినీతికి పాల్పడుతున్నాడని ఏ ప్రాధాన్యంలేని తూనికలు కొలతలశాఖలో వేశాడు. ఆయనగారు బెదిరిపోకుండా పెద్ద ఎత్తున దుకాణాలమీద దాడులు చేయించి కేసులు బుక్ చేయించాడు. ఇంకేముంది దుకాణదార్లు మంత్రిగారిని శరణుజొచ్చారు.

కొస మెరుపు: ప్రజా సదస్సుల పరంపరలో ముఖ్యమంత్రిగారు ఒక జిల్లాలోని చౌక ధరల దుకాణంలోకి వెళ్ళి స్వయంగా సరుకు నిల్వలు తనిఖీ చేస్తుండగా పి.ఏ. చెవిలో ''అయ్యా ఈ దుకాణం మన ఎం.ఎల్.ఏ గారి బంధువే నడుపుతున్నాడని'' సెలవిచ్చాడట. అంతే తనిఖీముగిసింది.

# స్వాతంత్ర్య ఫలం

దాదాపు 20 సంవత్సరాల తర్వాత స్వగ్రామంలో ఒకబాల్య మిత్రుడు కలిశాడు. చదువుసంధ్యా లేనివాడు. గొర్రెల కాపరి. చదువుకొని, తెల్లబట్టలు వేసుకున్నవాళ్ళు చాలాగొప్ప వాళ్ళని నమ్మేవాడు. వారి కృత్రిమ బ్రతుకులు తెలువని వాడు. స్వచ్ఛమైన గ్రామీణుడు. అడవిమనిషిలా బ్రతుకుతున్నాడు. నాగరిక జీవనం వాసన ఆయనకేమాత్రం తగిలినట్టులేదు. తల పాగ, దొడ్డుదోవతి, గొంగలి, చేతిలోకట్టె ఆయనవెంట రెండు కుక్కలున్నాయి. మేమిద్దరం మాట్లాడేది తెలుగే అయినా ఒకరిభాష మరొకరికి అర్థం కానంత ఎడం మామధ్య పెరిగింది. నా ప్రశ్నలు ఆయన జవాబుల సారాంశం ఈ విధంగా ఉంది.

గొర్రెలు మేకలు కలిసి ఆయనకు ఇరవై జీవాలున్నాయి. అవి కాక మరోపది ఇతరులవి కాస్తున్నాడు. అందుకు ప్రతిఫలం పుట్టిన జీవాలు చెరిసగం. సంవత్సరంలో దాదాపు 6 మాసాలు అడవుల్లోనే గడచిపోతుంది, ముఖ్యంగా వర్షాకాలమంతా. పంటకాలంలో వాటిని ఊరుచుట్టూ మేపడం కుదరదు. రైతులు తిడతారు పంటలు పాడవుతాయని. అడవిలో మందతో కనీసం నలుగురు కాపర్లన్నా కలిసి వెళతారు. చలి, ఎండ, వానలన్నింటికి రక్షణగొంగలే. పంచెలో బియ్యం మూటకట్టుకుంటే ఎక్కడ ఆకలేస్తే అక్కడ ఉడకబెట్టుకుని తింటారు. వర్షం ఎక్కువ పడ్డరోజు కట్టెలు వెలగవు. కాస్త బియ్యం బుక్కి మేకపాలు పిండుకుని త్రాగుతారు. కుందేలు, అడవి కోళ్ళలాంటివి దొరికితే కాల్చుకుని తింటారు. నిలబడి చేతికర్రపై తలఆనిస్తే అదే విశ్రాంతి. ఆ అడవిలో దొంగలొస్తే దిక్కులేదు. వీరు కాక లైసెన్స్‌డ్ దొంగలు కొందరు మామూళ్ళకై వేదిస్తారు. అన్నలు ఎదురౌతారు, యోగక్షేమాలు తెలుసుకుంటారు. వాళ్ళ పుణ్యమా! అని పండగలకు పబ్బాలకు జీవాలు కావాలని అడిగేవారు తగ్గారు. రోగాలు నొప్పులొస్తే దేవుడిదే భారం. పాముకుట్టినా కళ్ళుమూసుకుని దేవున్ని ప్రార్థించడమే. గొర్రెలు మేకలైతే టపటపా చచ్చిపోతాయి. పొలాలు చేన్లలో మంద పెడితే లాభం. అడవిలో క్రూర జంతువుల బారినుండి జీవాలను కాపరులను కాపాడేవి కుక్కలు. పులులు, సింహాలు నామరూపాలు లేకుండా పోయాయి. చిల్లరమల్లర జంతుల బారినుండి కాపాడేది చేతిలో కర్రనే. ఇదీ వాళ్ళ బ్రతుకు.

45 సంవత్సరాల స్వాతంత్ర్యఫలం వారికి మిగిల్చింది గొంగళి, తాటిమట్టల చెప్పులు, తంబాకు చుట్ట, ఇప్పసారా దొరికితే అదే స్వర్గం.

# బాంచెనుకాల్మొక్తా!

ఒకనాడు ''బాంచెనుకాల్మొక్తా'' అంటే వారు తెలంగాణీయులనేవారు. నిజాము ప్రభువు పాశవిక పాలనలో దొరలకాలంలో అణచివేయబడ్డ అట్టడుగు ప్రజలు విధిలేక అన్నమాట అది. పోలీసు చర్యతో ఆ బానిస బ్రతుకు నుండి విముక్తి లభించింది. ప్రజలు నలభయ్యయిదేళ్ళ స్వాతంత్ర్యాన్ని అనుభవించాక కూడా ఇంకా కాళ్ళుమొక్కేవారు మొక్కించుకునేవారు ఉండడం విచారకరం.

కాళ్ళు మొక్కడమన్నది బానిస లక్షణం. తల్లితండ్రులు, గురువు, దైవం యితర పెద్దలకు భక్తిప్రపత్తులతో మొక్కడం వేరు. పదవి కోసం, పరపతి కోసం, భయపడి కాళ్ళుమొక్కే నాయకుల సంఖ్య ఈ మధ్య పెరిగిపోతుంది. ఇది నేటి రాజకీయ కల్చర్. దీన్నే ఫ్యూడల్ లక్షణం అంటారు లెఫ్టిస్టులు. పూర్వం కమలాపతి త్రిపాఠి లాంటి వారిని కాళ్ళుమొక్కితే కనికరించే వారని విమర్శించేవారు. కాని అందరికన్నా పెద్ద లెఫ్టిస్టును నేనే అని ప్రకటించుకున్న తెలుగన్నకు కూడా ఈ జబ్బు ఎక్కువ మోతాదులో ఉండడం విచారకరం. పదవీ, హోదాల కోసం కాళ్ళు పట్టుకోవడమేం ఖర్మ ఏ పనైనా చేయడానికి వెనుకాడని మహానుభావులు చాలా మందే ఉన్నారు. వారొచ్చి కాళ్ళ మీద పడితే పాపం అధికారంలో వున్న వారిని తప్పు పట్టడం న్యాయమా! అని కొందరంటారు. రాజకీయంగా మమ్మల్ని కార్లెక్కించి గెస్టుహౌజ్‌ల చుట్టూ తిప్పిన దయార్ద్రహృదయున్ని కాళ్ళు మొక్కితే తప్పేమిటని కొందరు అంటున్నారు, కాబట్టి ఆ విషయం వదిలేద్దాం.

కాళ్ళుమొక్కేవాళ్ళు వ్రేళ్ళు పిసికేవాళ్ళు, గోల్లుగిల్లేవారు వీరే ఈ రోజుల్లో విజయవంతమైన పైరవీకార్లు. అందితే జుట్టు లేకపోతే కాళ్ళు పట్టుకోగలిగిన వారు. వీరు చేతుల్ని కాళ్ళుగా మార్చగల దిట్టలు. ఇవి చేతులుకావు కాళ్ళు అనో కడుపులో తలపెట్టో, ముద్దుపులు చెల్లించుకొనో పనులు చేయించుకో గల కార్యశూరులు వీరు. ఇలాంటి అనుచరులను కోరుకునే నాయకత్వమే మన రాజకీయాల్లో కనబడుతుంది. వసుదేవునంతటివాడు గాడిదకాళ్ళు పట్టుకున్నాడంటారు. అవి ముందుకాళ్ళా వెనుక కాళ్ళా మనకు తెలియదు. కాళ్ళు పట్టించుకోవడం జంతువులకు గిట్టే విషయం కాదు. అవి ఈడ్చి తంతాయి. పురాణకాలం నుంచి గాడిదనెందుకంత తక్కువదృష్టితో చూస్తు న్నారో కాని అది ఎంతో ఉపయోగకరమైన జంతువు. యజమానికి ''గాడిదచా కిరి'' చేసి దాని జన్మధన్యం చేసుకుంటుంది. కాని రాజకీయ నాయకులు అలాంటివారు కాదు. వీరు అభినవ వామనులు. కాళ్ళు మొక్కిన బలిచక్రవర్తులె ందరినో పాతాళానికి అణగద్రొక్కగలిగిన దిట్టలు.

# ఏడుపులోనున్న హాయి!

మగడు కొట్టినందుకు కాదు సవతి నవ్వినందుకు ఏడ్చిందట వెనకటికో ఇల్లాలు. ఏమే పిల్లా నీకేకాయ ఇష్టమంటే మగడుపెట్టిన మొట్టికాయ అందట మరో గృహిణి. నచ్చినవాడు కొట్టినా, తిట్టినా బాగానే ఉంటుంది. కొడితేకొట్టాడులే ముక్కు బరువన్నా తగ్గిందని తృప్తిపడేవారు చాలామంది ఉన్నారు. హృదయ పూర్వకంగా, నోరారా, గట్టిగా ఒకగంట సేపు ఏడిస్తే కన్నీళ్ళన్నీ పోయి హృదయభారం తగ్గడం సహజమే. భారీవర్షం తర్వాత ఆకాశం నిర్మలంగా ఉన్నట్టు ఏడ్చిన తర్వాత మనిషి కూడా అంతే తృప్తినిపొందుతాడు. అందుకే శాస్త్రజ్ఞులు అప్పుడప్పుడు ఏడ్వడం ఆరోగ్యానికి మంచిదంటున్నారు. దానివల్ల తల నొప్పిలాంటి చిన్నచిన్న వ్యాధులు తగ్గడమే కాకుండా మానసికంగా ఎంతో రిలీఫ్ లభిస్తుందని వారి సలహా.

అయితే ఏడ్వడానికే మనిషికి అవకాశాలు చాలా తక్కువ లభిస్తున్నాయి. కొన్ని ఏడుపుగొట్టు మొహాలుంటాయి. వారు ప్రతి విషయానికి ఏడుస్తూనే ఉంటారు. పొరుగు వాడు తెగ సంపాధిస్తున్నాడని, తన కొక్కడికేకాక మిగతా వారికి కూడా ప్రమోషన్ వచ్చిందని, తోటివాడు ఇల్లుకట్టాడని ఏడ్చేవారు కొందరు.

నాగరిక జీవనానికి, కృత్రిమత్వానికి, నటనకు అలవాటుపడ్డ సిటీలైఫ్‌లో మనుష్యులకు ఏడుద్దామంటే కుదరడం లేదు. ఇంట్లో ఏడిస్తే ప్రక్కవాళ్ళు వింటారు. పార్కులో ఏడిస్తే పబ్లికంతా చూస్తారు. ఒంటరిగా ఏగుట్ట మీదికైనా వెళ్ళి ఏడుద్దామంటే పిచ్చివాడనుకునే ప్రమాదం ఉంది. అందుకే వీరు కుమిలి కుమిలి మౌనంగా ఏడ్వడం నేర్చుకున్నారు. వీరు కన్నీరు కార్చరు త్రాగేస్తారు. నాగరికులైన భర్తలు పెళ్ళాలను హింసించడానికి ఈ పద్ధతే కనిపెట్టారు. కొడితే పల్లెటూరివాడనో, మొరటు మొగుడనో అంటారు. మాట్లాడకుండా ఇంటికి లేటుగా వస్తూ కూరలకు వంకలు పెడుతూ అత్తమీది కోపం

దుత్తమీదన్నట్లుగా పిల్లలపై విసుక్కుంటూ పెళ్ళాన్ని ఎంతైనా హింసించవచ్చు. ఇది పోలీసు ఇంటరాగేషన్ లాంటిది. బయటికి గాయాలేం కనబడవు కాని దెబ్బలకన్నా ఘోరమైన మానసికబాధను ఎదుటి వ్యక్తి అనుభవిస్తుంది.

పల్లెటూరు వాళ్ళు అలాకాదు, కోపంవస్తే భర్త భార్యను కొడతాడు. ఆమెశోకంపెట్టి ఏడుస్తుంది. ఇరుగు పొరుగు వారంతా మూగుతారు. అమ్మలక్కలంతా ఎందుకు ఏడుస్తున్నావమ్మా! అని అడగాల్సిన పనిలేదు. ఏడుస్తూనే విషయాల్ని వల్లిస్తుంది. వెతల కథంతా విన్నాకనే ఆమెను ఊరుకోబెడతారు. కంట్లోకి నీరు రాకముందే ఊరుకొమ్మని నోరు మూయించడం చదువుకున్న వారి పద్ధతైంది.

కొందరు ఏడిస్తే కర్ణకఠోరంగా ఉంటుంది. అది వినలేక మనం ఏడ్వాలి. మరికొందరి ఏడుపు చక్కగా సంగీతంలా విన్నకొద్దీ వినాలనిపిస్తుంది. మాతాత గారనేవాడు మా అమ్మతో ''ఆండాళు నువ్వు ఏడిస్తే నాకు హాయిగా జోలపాడినట్లు నిద్దరొస్తుందే'' అని.

ఈ రోజుల్లో ఏడుపుకు అర్థమే మారిపోయింది. పదవిలో ఉన్న రాజకీయవేత్తకు ఏదైనా కష్టమొస్తే ఆయన కన్నాముందు ఆయన అనుచరులు కర్చీపుల్ని తడుపుకుంటారు. ఆ విధంగానైనా శ్రీవారి అభిమానం సంపాదించవచ్చునని. అభిమాన నాయకుడు చనిపోతే ఏడ్వడంకాదు ప్రాణాలు తీసుకునే వీరాభిమానులు తమిళ రాజకీయాల్లో మరీ ఎక్కువ. అధికారంలో నున్న వారిపై ప్రతిపక్షాల ఏడుపు తక్కువదేమి కాదు.

కొసమెరుపు: నాకు చాక్‌లెట్ కొనియ్యినాన్నా! అని కొడుకు ఏడుస్తున్నాడు. తండ్రివాన్ని అమాంతంగా లేపి ఇంటికప్పుమీద కూర్చోబెట్టాడట. నాకు చాక్‌లెట్ వద్దు నాన్నా క్రిందికి దింపుచాలు అన్నాడట పిల్లవాడు.

కాలజ్ఞానం

వేముల ప్రభాకర్

# నటనలు నేర్చెను చాలా

స్వాతంత్ర్యానికి పూర్వం దేశ రాజకీయాల్లో ఎక్కువగా ప్రవేశించినవారు న్యాయవాదులు. ఎక్కువగా రాణించింది కూడా వారే. స్వాతంత్ర్యం తర్వాత ఈ ధోరణి మారిపోయింది. ఇప్పుడు రాజకీయాల్లో నటులకే ఎక్కువ భవిష్యత్తు కనిపిస్తుంది. రాజకీయాల్లో నటులే ఎక్కువగా ఎందుకు రాణిస్తున్నా రంటే నటించడమే రాజకీయం కాబట్టి. ఎవరు ఎంత బాగా నటిస్తే వారంత గొప్ప రాజకీయ వేత్త అనిపించుకుంటారు. అమెరికా అధ్యక్షుడైన రోనాల్డురీగన్ మొదలుకొని, ఎం.జి.ఆర్. ఎన్.టి.ఆర్, జయలలిత మొదలగు వారు అంతా నట రాజకీయవేత్తలేకదా.

ఎన్నికల్లో పోటీ చేసినప్పుడు ప్రజల ముందు తన తాహతుకు మించిన పనులు చేస్తానని చెప్పి పదవులు లభించాక పెరిగిన స్వార్థాన్ని కప్పిపుచ్చుకోడానికి నటన తప్పదుకదా! పార్టీ టిక్కెట్ సంపాదించాలంటే తన వెంట గొప్ప బలముందని కిరాయి మనుష్యుల్ని చూపించి, లేని బ్యాంక్ బ్యాలన్సులు, రాని చందాలు, కాగితపు ఆస్తుల్ని చూయించాలికదా. అధిష్టానవర్గంపై ఎంత కోపమున్నా పరమ భక్తునిలా పోజు పెట్టాలి కదా! తనకు గిట్టని వారికి పార్టీ టిక్కెట్ యిచ్చినా అయిష్టంగా ఎన్నికల ప్రచారంలో పాల్గొని ముందు చేతులు జోడించి వెనుక గోతులు త్రవ్వడానికి ఎంతో గొప్పగా నటించాలి మరి. లేక పోతే వ్యవహారమంతా బయట పడిపోతుంది.

ఫలానాగారు ముఖ్యమంత్రి లేదా మంత్రి అయ్యారనే సరికి వంది మాగదుల ంతా సన్మానాలతో చంపుకుతింటారు. ఇష్టంలేని వారు కూడా ఎంతో పొగిడి ఆకాశానికి ఎత్తి రాత్రి ఇంటికి వచ్చాక మందుకొట్టి కుళ్ళి కుళ్ళి ఏడుస్తారు. శ్రీ అంజయ్యగారు ముఖ్యమంత్రి అయ్యారని తెలవగానే ఆయనతో పాటు ఎంతోకాలంగా లేబర్ రాజకీయాలు నడిపిన మరో పెద్దమనిషి ''అంజయ్యానేను

హైదరాబాదు ఇరానీ హోటల్‌లో వన్‌బైటూ చాయ్ తాగి పైకొచ్చినవాళ్ళమే కదా? ఇద్దరమూ లేబర్ లీడర్లమే గదా ఆయనకన్నా నాకే ఇంగ్లీష్ ఎక్కువ వస్తుంది మరి. నాకెందుకియ్యలేదు ఆ పదవి'' అన్నాడట. పాపం ఆయనకు నటన చేతకాలేదు.

నటన రాజకీయాలకే పరిమితమైలేదు. అన్ని వర్గాల వారు అంతో ఇంతో నటన చేస్తున్నవారే. ఉద్యోగి బాస్ చెప్పిన ప్రతి పనికి ఎస్ అంటాడు. కాని బయటికి వచ్చాక పంది, కుక్క అని తిట్టుకుంటాడు. కొన్ని పాశ్చాత్యదేశాల్లో ఉద్యోగులకు అధికారులపై పెరుగుతున్న కోపాన్ని తగ్గించడానికి ఒక చిట్కా కని పెట్టారట. బాస్‌ను పోలిన ఒక బొమ్మను ప్రత్యేక గదిలో ఉంచుతారట. ఆయనమీద కోపం వచ్చిన ఉద్యోగి కాస్సేపు ఆగదిలొకి వెళ్ళి కసి తీరే వరకు బాస్ బొమ్మను తన్ని గ్రుద్ది రావచ్చుట. దాంతో కాస్త టెన్షన్ తగ్గి ఉద్యోగులు ఎంతో రిలీఫ్ ఫీలవుతున్నారట.

ఇంట్లో గృహిణికి కూడా నటన తప్పడంలేదు. అనుకోని అతిథులు వేళకానివేళ ఇంటికి వచ్చినప్పుడు ఇష్టంలేకున్నా చిరునవ్వు మోహంపై పులుముకుని స్వాగతం చెప్పకతప్పదాయే. బంధువుల్లో మూడు రకాలు. భార్య తరపువారు, భర్త తరపువారు వారిద్దరికి సంబంధించినవారు. ఈ మూడో వర్గంతో పేచీలేదుకాని భార్యబంధువులంటే భర్తకు, భర్త బంధువులంటే భార్యకు గిట్టని రోజులివి. ఇంట్లో ఆదరణ ఎక్కువగా లభించేది భార్య బంధువులకే మరి. వడ్డించే చెంచా ఉండేది గృహిణి చేతుల్లోనే కాబట్టి. నేనే ఎక్కువగా నిన్ను ప్రేమిస్తున్నానంటే కాదు నేనే అని వాదించుకునే భార్యాభర్తలు సినిమాల్లోనే కాదు జీవితంలో కూడా **కన**బడతారు. కానీ ఒక పరీక్షా సమయం వచ్చినప్పుడే వారి మాటల్లోని నిజా**యితీ** ఎంతో బయటపడుతుంది. 'నీభార్యకు ఓపన్ హార్టుసర్జరీ చేయకపోతే **బతకదు** యాభైవేల రూపాయలు తీసుకురమ్మంటే అదెందుకు దండగ మరో పెళ్ళి చేసుకుంటే నాకే యాభై వేలు ఇస్తారుగా' అన్నాడట ఓ భర్త. జీతం **చేతికొ**చ్చిన మొదటి వారములో ముద్దుముద్దుగా కనబడ్డ భర్తే ఆఖరి వా**రంలో** మూర్ఖుడౌతాడు పెళ్ళాం దృష్టిలో. ఇవన్నీ కృత్రిమ నాగరిక జీవి**తంలో**ని లొసుగులు.

కొసమెరుపు: దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు వచ్చిన సందర్భంగా ప్రముఖ నటుడు శ్రీ అక్కినేని మాట్లాడుతూ ''**అప్పుడే పుట్టిన** పాప తల్లి పాల కోసం ఏడ్వడంలోకూడా నటన వుంది'' **అన్నాడు.**

# తలారి రామన్న తతంగం

ఇంట్లో యజమాని యజమానురాలు కూతురు పెళ్ళి గురించి మాట్లాడు కుంటున్నారట. ''పెళ్ళి నిశ్చయమైంది బంధువులందరికి కబురు చేయాలి, రేపు ప్రొద్దునే తలారీ రామన్నతో కబురుచేద్దాం'' అనుకున్నారు వారు. అప్పుడే ఇంటికి వచ్చిన రామన్న చెవిలో పడ్డాయి ఈ మాటలు. యజమాని బంధువుల ఊర్లన్నీ వాడికి తెలును, ఇక ఆగడమెందుకు ఎప్పుడైతేనేం వెళ్ళొద్దాం అని సరాసరి రాముడు యజమాని బంధువుల ఊర్లకు వెళ్ళి తెల్లవారేసరికి వాపసు వచ్చేశాడట సంతోషంగా. అదే విషయం అయ్యగారికి చెప్పేశాడు. వాళ్ళకు ఏమి కబురు చెప్పావు అంటే ''పెళ్ళి నిశ్చయమైంది రమ్మాన్నాను. ఏరోజ ంటే తెలువదన్నాను'' అన్నాడు అమాయకంగా. అదీ కథ.

ప్రస్తుత అంశమేమిటంటే కొన్ని రాజకీయ పార్టీలు ఏదో ఒక పేరుమీద రాజధాని నగరంలో బ్రహ్మాండమైన ఊరేగింపులు బహిరంగ సభలు జరుపుతు న్నవి. వీటి ఉద్దేశ్యం ప్రచారంలో ఎన్ని గొప్పలు చెప్పుకున్నా బల ప్రదర్శన మాత్రమే. ఈ సభలకు, ఊరేగింపులకు జనాన్ని పెద్ద ఎత్తున సమీకరించడం జరుగుతుంది. వీరిలో చాలామంది మన తలారి రామని లాంటివారే. అధికార పార్టీకి వాహనాల కొరత లేదు. రవాణా అధికారులను ఆర్. టి.సి. వారిని పిలిస్తే రెగ్యులర్ బస్సు సర్వీసులన్నీ రద్దు చేసి పంపుతారు. ప్రైవేటు సర్వీసుల యజమానులు కూడా నాయకులయెడ తమ భక్తిని ప్రదర్శించు కోవడానికి ఈ అవకాశాన్ని వినియోగించుకుంటారు. లేక పోతే వారి రూటు పర్మిట్లకు కాలం చెల్లిపోతుంది.

రాత్రికి రాత్రి బస్సుల్లో లారీల్లో జండాలు కట్టుకొని లక్షల సంఖ్యలో వచ్చిన ఈ జనం ఊరేగింపులో పాల్గొని సభాస్థలికి చేరుకునే సరికి దారిపొడుగునా హోటల్లన్నీ ఖాళీ అయిపోతాయి. త్రాగడానికి నీళ్ళుకూడా దొరకవు. గొప్పగా ఏర్పాట్లు చేశాం, నీళ్ళకు లారీలు పెట్టాం, భోజన పొట్లాలిస్తాం అని ప్రకటించిన వారు సమయానికి కనబడరు. ఎండకు ఎండి వానకు తడిసి, చలికి గడగడా వణుకుతూ, మళ్ళీపల్లెకు చేరుకునే సరికి తల ప్రాణం తోకకు వస్తుంది. ఇంతాచేసి అక్కడి బహిరంగ సభలో నాయకులు చెప్పిందేమిటి వీళ్ళు విన్నదేమిటి? ఫలితం నీళ్ళల్లో వ్రేలుపెట్టి నాకినట్లే. తలారి రాముడు ఊళ్ళకి పోయి వచ్చినట్లే.

కొసమెరుపు: 'ఏమన్నా! హైదరాబాదు పోయొచ్చినవ్ గదా మీటింగుల ఏం జెప్పిండ్రు' అంటే 'ఉండుతమ్మీ! ఇయ్యాల్లటి పేపర్ జదివి చెప్తా' అన్నాడట

# దేవరాలలో దెయ్యం

రోడ్డు ప్రమాదంలో ప్రాణాపాయ స్థితిలోనున్న మనిషిని చూస్తూ కూడా తమకేమిపట్టనట్లు వెళ్ళిపోగలరు, సంగతి పోలీసులు చూసుకుంటారులే అని. పట్టపగలు నడిరోడ్డుననడుస్తున్న స్త్రీని రౌడీలొచ్చి ఎత్తుకు పోయినా చూస్తూ ఊరుకోగలరు తమకెందుకులే అని. రాజస్థాన్ లోని దేవరాల గ్రామంలో కూడా అదే జరిగింది. వేలాది మంది జనం ఒక స్త్రీ సతీ సహగమనాన్ని చూస్తూ నిలబడి పోయారు. కాలిపోతున్నది తముకాదుకదా అని! కాని ఆసంఘటనతో మన దేశం పరువు తగలబడి పోయింది. ఎంతఘోరం అని అంతా ముక్కున వేలేసుకున్నారు. ఈ ఇరవయ్యవ శతాబ్దంలో కూడా సతీ సంఘటనలు జరగడం సిగ్గుచేటన్నారు. కాని ఏం చేస్తాం అలాంటి సతిని కూడా బలపరిచే మహానుబావులు మన దేశంలో, మనమతంలో యింకా బ్రతికే ఉన్నారు. సాక్షాత్తు ఒకానొక శంకరాచార్యవారు దీన్ని బలపరిచారు, అది తప్పుకాదంటూ రాయన. మన పురాణాల్లో, చరిత్రలో యిలాంటి సంఘటనలున్నాయికదా! అని వారి వాదన. సీత శీలాన్ని శంకించి అగ్నిలో దూకమన్నవాడు మనదేవుడే, శివుని కోసం అగ్నికి ఆహుతైన పార్వతి మనదేవతేనాయె. ఎంత గొప్పసాంప్రదాయం మనది. ఇంగ్లీషువాడు ఈ దేశంలో అడుగుపెట్టి ఒక విధంగా మంచిపనే చేశాడేమో ననిపిస్తుంది. వాడి పరిపాలన పుణ్యమా! అని ఎన్నో సాంఘిక దురాచారాలు, చాందసాలు తగ్గిపోయాయి.

ఉత్తర భారతంలో సతీ మాతల గుళ్ళు, గోపురాలు లెక్కకు మిక్కిలి. సతీ సహగమన దృశ్యం ఫోటోలు, క్యాలెండర్లు ఇంటింటా కనబడతాయి. ఒక నిషేధించబడ్డ దురాచార దృశ్య బొమ్మలు విచ్చలవిడిగా ప్రింటవడం, ప్రచారం చేయబడడం, పూజింపబడడం తప్పని తెలిసి కూడా మన వాళ్ళు ఊరుకోరాయె.

రూప్ కన్వర్ స్వచ్ఛందంగా చితి మీద కూర్చుంటే ఆమెను ఉన్మాది అనాలి. ఇతరుల ప్రోత్సాహం, బలవంతం మీద జరిగితే దాన్ని మర్డర్ అనాలి. బలవన్మరణం కేసులన్నీ దెయ్యాలవుతాయంటారు. దేవరాలది దెయ్యం కేసే.

కొసమెరుపు: రూప్ కన్వర్ మరణానికి కారకులైన వారందర్ని అరెస్టు చేసి, వారికి విధించాల్సిన శిక్ష గురించి నాటి విక్రమాదిత్యుని తీర్పుకోరితే అందులో మగవారికి ''పతీ సహగమనం'' ఆడవారికి ''సతీ సహగమనం'' చేయించమని చెప్పేవాడేమో.

వేముల ప్రభాకర్

# పురిటి నొప్పులు

పూర్వకాలం పెళ్ళిళ్ళకు ఈ రోజుల్లో పెళ్ళిళ్ళకు చాలా తేడాలున్నాయి. బంధు మిత్రుల ద్వారా పెళ్ళిళ్ళ పేరయ్యల ద్వారా సంబంధాలు కుదుర్చుకున్న వారు పూర్వులు. ప్రేమవివాహాలు, రాక్షస వివాహాలు కూడా నాడు జరిగాయి. కులాంతర, మతాంతర వివాహాలు జరిగాయి, అయితే తక్కువ. ఈ రోజుల్లో చాలా పెళ్ళిళ్ళు పత్రికల ద్వారా జరుగుతున్నాయి. ఏ పత్రిక పేజీలు విప్పినా మ్యారేజ్ కాలమ్‌లు కనబడతాయి. వధూ వరుల ఎత్తు చిత్తులు ఆదాయం అవసరాలు తెలుపుతూ ఎన్నో ప్రకటనలు కనబడతుంటాయి. మ్యారేజ్ బ్యూరోలు వెలసి పెళ్ళిళ్ళను మరింత ముందుకు తీసికెళ్ళాయి. ఈ బ్యూరోల్లో ఫీజు చెల్లించి పేరు రిజిష్టరు చేసుకుంటే వాళ్ళే సరియైన సంబంధం కుదిర్చి పెడతారు. కాకపోతే కట్నాల్లో కమీషన్ చెల్లించుకోవాలి అంతే. కొన్ని కులసంఘాలవారు మరో అడుగుముందేసి పెళ్ళి చూపుల మేలాలు ఏర్పాటు చేస్తున్నారు. పెళ్ళి కావలసినవారు, వారి పెద్దలు ఆ మేలకువస్తే తమకు నచ్చిన తమను మెచ్చిన వారిని ఎన్నుకోవచ్చు. పెళ్ళి చూపుల ఖర్చులు తప్పుతాయి.

భవిష్యత్తులో రేడియో టీవిల్లో పెళ్ళిళ్ళ అడ్వర్టయిజ్‌మెంట్లువచ్చినా మనం ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. కొన్ని విదేశాల్లో ప్రైవేట్ దూరదర్శన్ వ్యవస్థ అనుమతించబడిన చోట యువతీయువకుల ఫోటోలు చూపి సరియైన జతల నుండి దరఖాస్తులు కోరుతున్నారట. అంతే కాదు కంప్యూటర్లు కూడా పెళ్ళిళ్ళు కుదురుస్తున్నాయట. అసలు ఈ పెళ్ళి గొడవలన్ని ఎందుకు తర్వాత విడాకులు తీసుకోవాలనుకున్నప్పుడు అనవసరంగా కోర్టు ఫీజులు వకీలు ఫీజులు కట్టాల్సి వస్తుంది. కనుక అసలు పెళ్ళే చేసుకోకుండా కలిసి సంసారం చేస్తే సరిపోతుందనుకుని కొందరు అభ్యుదయ వాదులు ముందుకొ

చ్చారు. ఇష్టమున్నంతకాలం మోజున్నంతకాలం కలిసి ఉండి అది తీరాక హాయిగా దెబ్బలాడుకోకుండా విడి పోవచ్చునన్నది వారిఅయిడియా. ఇది బాగానే ఉంది. కాని పానకంలో పుడకల్లాగా పుట్టుకొచ్చే పిల్లల సంగతేమిటి? అందుకే బాంబే సినీ తారలు ముందే అగ్రిమెంట్లు చేసుకుంటున్నారట. ఇటీవల పోస్టల్ డిపార్ట్మెంటు వారికి ఒక చిక్కొచ్చిదురైంది. ఒక మహా ఇల్లాలు (ఇల్లుకలది కాబట్టి) పెళ్ళి కాకుండానే గర్భం తెచ్చుకుని నాకు ప్రసవకాలం సెలవు ఇవ్వమందట. పెళ్ళికాని కేసుల్లో మ్యాటర్నిటీ లీవ్ యివ్వొచ్చా లేదా అని తలలు బద్దలు కొట్టుకుని న్యాయ నిపుణులను సంప్రదించారట. పెళ్ళి చేసుకున్నా చేసుకోకున్నా పురిటి నొప్పులు తప్పవు కదా కాబట్టి సెలవివ్వాల్సిందేనని నిర్ణయించారట.

ఫిలిప్పీన్స్‌లో ఇటీవల ఒక వింత జరిగింది. పుట్టుకతోనే స్త్రీపురుష అవయవాలు రెండూ కలిగి వున్న మనిషి యింతకాలం పురుషుడిగానే జీవించాడు. ఒక మిలటరీ ఆఫీసర్‌తో స్నేహం చేసి గర్భం తెచ్చుకున్నాడట. ఆయన మేల్ నర్స్‌గా పని చేస్తున్న ఆస్పత్రివారు ముందు కాదన్నా తర్వాత దిగివచ్చి మెటర్నిటీ లీవ్ మంజూరు చేశారట. అంతే కాదు ఆయనగారి సుఖ ప్రసవం కోసం అన్ని ఏర్పాట్లు చేశారట.

కొసమెరుపు: పూర్వం ఒక పతివ్రత ఘోరంగా తపస్సు చేసి బ్రహ్మగారిని ఒకవరమడిగిందట. అయ్యా పిల్లల్ని కనేపనంతా ఆడవాళ్ళకే అంటగడితే ఎలా కనీసం పురిటి నొప్పులన్నా మగవారికి వచ్చేట్టు చూడమని ప్రాధేయపడిందట. ఇచ్చానుపో అని ఈజీగా బ్రహ్మగారు అన్నారట. ఆ మహాతల్లికి ప్రసవ సమయం వచ్చి రాగానే సదరు భర్త మంచమెక్కి పురిటి నొప్పులకోసం ఎదురు చూడసాగాడట. కాని నొప్పులు పక్కింటాయనకు రావడం మొదలైందట. ఆ పతివ్రత వెంటనే బ్రహ్మగారిని బతిమాలి అయ్యా ఆ వరం వాపసు తీసుకోమందట. అదీ కథ.

# కరువులో వాంతి

ట్యాంక్ బండ్ పై వెలసిన తెలుగు వెలుగుల్ని సరదాగా చూస్తుండగా పల్లెటూరి పెద్దమనిషి అమాయకంగా నా దగ్గరకు వచ్చి ''అయ్యా ఇందులో ఎన్.టి.ఆర్ గారి విగ్రహమెక్కడా'' అన్నాడు. అన్నీ ఎన్.టి.ఆర్. విగ్రహాలే సందేహమెందుకు అని చెప్పాను, శ్రీకృష్ణదేవరాయులు, బ్రహ్మంగారు, శాలివాహనుడు మరియు బ్రహ్మనాయుడు యిలా ఏ విగ్రహం చూసినా ఎన్.టి.ఆర్. పోలికలే. ఎన్.టి.ఆర్.గారు కాస్త తెలివిగా తన వేషంలో పెక్కుమంది తెలుగు వెలుగుల్ని ప్రతిష్టించి ఒకే దెబ్బకు రెండు పిట్టల్ని కొట్టేశారు.

''ఇంతకూ పై విగ్రహాల్లో ఎన్.టి.ఆర్. పోలికలే ఎందుకొచ్చాయంటావు'' అన్నాడో మిత్రుడు. నేనాయనకు కీ.శే. శారద రచించిన కథ చెప్పాను. ఒక పిసినారి జమీందారు పంచలోహాలతో ఒక దేవుని విగ్రహాన్ని చేసే పనిని ఒక శిల్పికి అప్పగించాడట. శిల్పి పంచలోహాలను ఎక్కడ మిగుల్చుకుంటాడోనని జమీందారు ప్రతిరోజు శిల్పి కుటీరంలోనే కూర్చోసాగాడు. విగ్రహ నిర్మాణం పూర్తయింది. తీరా విగ్రహాన్ని ప్రతిష్టించాక చూస్తే అది అక్షరాలా జమీందారు గారిలాగానే ఉందట. దేవున్ని కొలుస్తామని వచ్చిన జనానికి జమీందారుగారి విగ్రహం కనబడడంతో వారు నిరాశ చెందారట. జమీందారుగారు శిల్పిని యిదేమిటయ్యా యిలా చేశావంటే ''నేనేం చేసేది స్వామి! రోజూ మీరే నాకళ్ళముందు కనబడుతుంటే మీ రూపం కాక దేవుడి రూపం ఎలా చేసేది'' అన్నాడట.

రాష్ట్రంలో వర్షాలు లేక, కరువు పరిస్థితులు నెలకొన్న తరుణంలో కోట్ల రూపాయలు వెచ్చించి విగ్రహాలు ఉద్యానవనాలు నెలకొల్పి ప్రయోజనమేమిటి. కరువులో వాంతి కాక.

కొసమెరుపు: గతంలో బ్రతికుండగానే విగ్రహం పెట్టుకుని భంగపడ్డ వాడు మన మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు. ఉక్కు ఫ్యాక్టరీ ఆందోళన సందర్భంగా వారి విగ్రహం ప్రజల ఆగ్రహానికి ముక్కచెక్కలైపోయింది. అయితే వారి 80వ జన్మ దినోత్సవంసందర్భంగావిగ్రహప్రతిష్టాపనకు ఏర్పాట్లు చేశారు. నిర్వాహకులు వచ్చి 'అయ్యా రేపే ప్రతిష్టాపన, యింకా విగ్రహం రాలేదన్నారట దానికి నవ్వుతూ సంజీవరెడ్డిగారు 'ఏం పర్వాలేదు సమయానికి విగ్రహం అందక పోతే నేనే నిలబడతాను' అన్నారట.

కాలజ్ఞానం వేముల ప్రభాకర్

# బ్రతక నేర్చిన వాళ్ళు

ఇటీవల దినపత్రికలో ఒక వార్త చదివాను ప్రభుత్వ సేవలో చాలా కాలం పనిచేసి రిటైర్ అయినతర్వాత ఒక ఉద్యోగి ఇంటికి వచ్చి తన గోడగడియారాన్ని బద్దలు కొట్టాడట. ఆ గడియారం ముక్కలు ముక్కలు అయ్యాకగాని ఆయన మనస్సు శాంతించలేదట. దాదాపు 30 సంవత్సరాల కాలం ఆగడియారం క్రమం తప్పకుండా గంటలు కొట్టడమే అది చేసినపొరపాటు. ప్రొద్దున గడియారంలో 9 గంటలు మ్రోగాయంటే చాలు అందరు ప్రభుత్వోద్యోగుల్లాగే అతనూ పరిగెత్తేవాడు. ఆ గడియారం చూస్తేచాలు ఆయనకు ఆఫీసుగుర్తువచ్చేది. రిటైరైనాక కూడా ఇంకా ఆ జ్ఞాపకాలు యిష్టంలేక ఆయనాపని చేసి ఉంటాడు.

హాయిగా నెలకు వేలకువేలు జీతం తీసుకుంటున్నారు, అయినా ప్రభుత్వోద్యోగులు సంతృప్తి పడరేం? అని ఎన్.జి.ఓల గురించి నాయకులు అనడం వింటుంటాం. అయ్యామేము ఎన్.జి.ఓ లమే కాదు నాన్ జీవులం కూడా. అంటే ప్రాణంలేని వారమని అర్థం. జి.వో అయినా ఎన్.జి.వో అయినా పెద్ద తేడా ఏంలేదు. ప్రభుత్వోద్యోగమే పసలేనిజీవితం అన్నది తలపండిన ఉద్యోగుల అభిప్రాయం. ఆమాటకొస్తే ఉద్యోగజీవితమే అంత. అస్తమానం ఇంక్రిమెంట్లు, ప్రమోషన్లు, ట్రాన్స్‌ఫర్‌పైరవీలు, సర్వీసులో అన్యాయం జరిగిందని పిటిషన్లు, మధ్యమధ్య స్ట్రయికులు, సస్పెన్షన్లు తప్పవు.

జీవితంలో సాహసం చేయలేని వాళ్ళు ఉద్యోగాలు కోరుకుంటారన్నది ఒక సైకాలజిస్టు అభిప్రాయం. స్వయం ఉపాధికల్పించుకుంటే ఒకవృత్తిని

చేపట్టిజీవిస్తే అందులో రిస్కు ఉన్న మాట నిజమే. ఉన్నతస్థానం చేరుకోవడా నికి ప్రైవేట్ జీవితంలో నున్న మార్గం ఉద్యోగ జీవితంలో లేదన్నది వాస్తవం.

ఎదుగూ బొదుగూలేని గొర్రెతోక జీవితమైనా సరే ఉద్యోగం కావాలని కోరుకునేవారే యువకుల్లో ఎక్కువవుతున్నారు. అబ్కారి శాఖలో కానిస్టేబుల్ ఉద్యోగానికి కూడా ఇరవయి అయిదు వేలైనా సరే ఖర్చు చేయడానికి సిద్ధపడ్డ వెన్నెముకలేని యువతను చూస్తున్నాం. విద్యార్థిదశలో ఎన్నినీతులు చెప్పినా అభ్యుదయ భావాలు కలిగిఉన్నా అవి ఉద్యోగి అయ్యేసరికి పారిపోతున్నాయి. లంచాలు దొరికే ఉద్యోగం ఏదయినాసరే వెంటనే పట్టేయాలని ఆదుర్దా పెరిగి పోతుంది. నైతికపతనం ఎక్కువవుతుంది.

మోతుకుకు మూడాకులే అని ఒకసామెత. ఉద్యోగి జీవితం కూడా అంతే. నెలకు మూడు వేలు సంపాదించే ఉద్యోగికి అందమైన వధువుకావాలని ఒక ప్రకటనచేస్తే అమ్మాయిలు చాలామంది రడీ. కాని తీరా పెళ్ళి చేసుకున్నాక గాని ఆ మూడువేలల్లో మిగిలేది మూడంకె మాత్రమేనని, మిగతా సున్నాలు జీతం వచ్చిన మొదటి వారంలోనే ఖర్చయిపోతాయని గ్రహిస్తారు.

అమెరికాలో వ్యాపారమంతా ఇన్‌స్టాల్‌మెంట్లు, హైర్‌పర్చేజ్‌ల మీదనే జరుగుతుందట. వాయిదాల మీద వస్తువులు కొనేవారు దాదాపు ఉద్యోగులే. ఈ వర్గంవారి సంపాదనలో ఎక్కువభాగం వడ్డీలకేసరి.

కొన్ని శాఖలలో కొన్ని ఉద్యోగాలలో అండర్‌హైండ్ డీలింగ్స్ ఎక్కువ. పైహోదాకు ప్రమోషన్ లభించినా వారిక్రింది పోస్టును వదిలి పెట్టలేరు. అసలు జీతం కన్నా కొసరులంచాలే వారికి లాభప్రదంగా వుంటాయి. మరికొంత మంది ఉద్యోగం ఏదైనాసరే తివిరి ఇసుకలో తైలంబు తీయవచ్చునన్నట్టుగా ప్రజల్ని పీడించైనా సరే తమకు రాకూడనిది రాబట్టుకుంటారు. వీళ్ళంతా బ్రతకనేర్చినవాళ్ళే.

కొసమెరుపు: శోభనంగదిలోంచి పుత్రరత్నం పరిగెత్తుకొచ్చి అమ్మా నాపెళ్ళాం వేలుకొరికిందే అన్నాడట. అక్కడేవున్న వాళ్ళనాన్న కల్పించు కుని పెళ్ళిచేయడం వరకే మా బాధ్యత ఆతర్వాత నీ పెళ్ళాం వేలు కొరికినా చెంపకొరికినా అది నీకర్మ అన్నాడట.

# పురుషులపాలిట పరుష వాక్కులు

"చెప్పేదానికి చేసేదానికి మన దేశంలో నున్నంత వ్యత్యాసం ఏ దేశంలోనూ లేదూ" అన్నాడొక సందర్భంలో జవహర్‌లాల్‌నెహ్రూగారు. అది నిజమేనేమో అనిపిస్తుంది. స్త్రీ సమానత్వం గురించి, స్త్రీ స్వాతంత్ర్యం గురించి మాట్లాడే అభ్యుదయవాది కూడా తన స్వంత ఇంటికి వెళ్ళేసరికి భార్యను ఒసేయ్, ఏమేవ్'అని సంబోధించడం తరచుగా మనం గమనించే విషయం. దీన్ని చాలామంది పురుషులు స్త్రీలు కూడా మామూలుగా తీసుకోవడం జరుగుతుంది. అదే ధోరణిలో ఆర్థిక స్వాతంత్ర్యం కలిగిన ఒక ఇల్లాలు కూడా భర్తను పట్టుకుని 'ఒరేయ్ ఏమిట్రా' అంటే వ్యవహారం చాలా దూరం వెళ్తుంది. ఇంకా చెప్పాలంటే విడాకులదాకా వస్తుంది.

ఉద్యోగంచేసే స్త్రీకూడా ఇంట్లో వంటపని, పిల్లలపోషణ స్వయంగా చూసుకోవాల్సిందే. ఇద్దరం ఉద్యోగులమేకదా అని ఈ విషయాల్లో భర్తముందుకొచ్చి భార్యకు సహాయపడడమన్నది ఎంతవరకు జరుగుతుంది. ప్రొద్దున ఏఇంట్లో చూసినా వాకిలి ఊడ్చే, వంటపాత్రలు శుభ్రం చేసే స్త్రీలు కనబడతారు. భార్య మీద ఆధారపడి బ్రతుకుతున్న నిరుద్యోగి భర్తకూడా ఈ పనులు చేయడం నామోషిగా భావిస్తాడు.

సంఘసేవ రాజకీయ ఉద్యోగ ప్రజాసంబంధ రంగాల్లో చురుగ్గా చొచ్చుకుని పోయే స్త్రీలను గూర్చి కల్లబొల్లి కబుర్లు చెప్పుకోవడం చాలామంది పురుషోత్తములకు కాలక్షేపం. తిరగక పురుషుడు, తిరిగి స్త్రీ చెడిందనే కాలం చెల్లిన సామెతలు ఇంకా ఎంతకాలం చలామణిలో ఉంటాయి. అక్రమ సంబంధం పెట్టుకున్నది మగవాడైతే విలాస పురుషుడు, స్త్రీ అయితే చెడిపోయిందా? రాజు చేస్తే రసికత్వం రాణి చేస్తే రంకుతనంలాగా. భార్యను కోల్పోయిన పురుషుడు పిల్లలున్నాసరే రెండో పెళ్ళి చేసుకోడానికి వెనకాడడం లేదు.

ఇరుగు పొరుగు అమ్మలక్కలు కూడా ''అయ్యోపాపం రెండో పెళ్ళి చేసుకోక పోతే మరి ఆపిల్లల్నెవరు చూస్తారని'' సమర్థిస్తారు. అదే భర్తను పోగొట్టుకున్న స్త్రీ ముఖ్యంగా పిల్లలున్నదైతే రెండవ పెళ్ళికి సిద్ధమైతే ఇదేంపోయే కాలమనే వింత మనుషులు ఈ సమాజంలో ఇంకా ఉన్నారు. పరాయి మతస్థుల పిల్లను మతం మార్పిడి చేయించి పెళ్ళిచేసుకుంటే సరేలే! అన్నవారు తమమతంలోని ఒక ఆడకూతురు మతం మార్చుకుని పెళ్ళి చేసుకుంటే తెగబాధపడిపోతారు. మతమార్పిడి విషయంలో పురుషుడికున్నంత స్వాతంత్ర్యం స్త్రీకి కూడా ఉందని ఎంతమంది సరిపెట్టుకుంటున్నారు.

వైదవ్యానికి సంకేతంగా స్త్రీ పసుపు కుంకుమలు, గాజులు వంటి అలంకరణ లకు స్వస్తి చెప్పి జీవచ్ఛవంలా ఎందుకుండాలి, పురుషుడైతే పూలరంగడిలా ఎందుకు తిరగాలి. పెళ్ళైన హిందూస్త్రీ మట్టెలు, మంగళ సూత్రం ధరిస్తుంది. మరి పెళ్ళైన పురుషున్ని గుర్తించడానికి 'సంకేతం' ఏమిటి. ఇలాంటి ప్రశ్నే పురుషపుంగవులు గయ్యాలిగా భావించే రంగనాయకమ్మగారు వేశారు. '' భార్య తన భర్త పేరును గుదిబండలా ఎందుకు మోయాలి'' అని. నిజమే ఆ పని భర్త చేయనప్పుడు భార్య మాత్రమే ఎందుకు చేయాలి. అయితే రంగనాయకమ్మగారు గ్రహించని విషయం ఒకటుంది. భర్తలపేర్లు తగిలించుకు నేది చదువుకున్న స్త్రీలే. ఏ విద్యాగంధంలేని పల్లెటూరు స్త్రీ భర్తపేరు మోయకపోవడమేకాదు చదువుకున్న స్త్రీ కన్నా ఎక్కువ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవిస్తుందన్నది వాస్తవం!

కొసమెరుపు: కుల సంకేతాలు తగిలించుకోవడం ఈ మధ్య మన స్త్రీలకు ఫేషనైంది. ఒక స్వాతంత్ర్య సమరయోధురాలు తన పేరుకు కులం తగిలించు కొని లక్ష్మీరెడ్డి అని రాసుకుందట. ఫించను మంజూరు చేసే అధికారులు మా రికార్డు ప్రకారం లక్ష్మి అనే వుంది మీకు ఫించను దొరకదు పొమ్మన్నారట.

# పడకటింటి ముచ్చట్లు

ప్రముఖ ఆంగ్లవార పత్రిక ఎడిటర్ గారు ఒకసారి సంపాదకీయం రాయడానికి ఎన్నుకున్న విషయం కోతియోని చుట్టూ తిరిగింది. కోతియోని భాగం ఎరుపెందుకూ? అన్నది ఆయన ప్రశ్న. దానికి జవాబుకూడా అయనే చెప్పాడు. మగకోతుల్ని ఆకర్షించడానికని. కోతికి మనిషికి ఎంతో సన్నిహిత సంబంధం ఉన్నా పై లక్షణం మనుష్యులకెందుకు రాలేదో తెలువదు. అది వేరువిషయం.

మన తెలుగు పత్రికల వారికి కూడా ఇలాంటి జబ్బే పట్టుకుంది. ఒక సంపాదకుడు అమెరికా దంపతుల్లో ప్రబలుతున్న ఒక మానసిక వ్యాధిని గురించి ప్రస్తావించాడు. అక్కడి భార్యాభర్తలిద్దరూ ప్రొద్దంతా ఉద్యోగ విధులు నిర్వర్తించివచ్చి పడకటింట్లో ఎడమొహం పెడమొహంగా ఉంటున్నారట. ఇంకా సూటిగా చెప్పాలంటే ఒకే పడక మీద నున్నా వారికి కోరికలు కలగడంలేదట, అదీ సమస్య. ఆ కోరికల కోసంవారు మానసిక నిపుణులైన డాక్టర్లతో సంప్రదించి నానా అవస్థలు పడుతున్నారట. అయితే ఆ ఎడిటర్ పై సమస్యకు ఒక సమాధానం చెప్పిఉంటే బాగుండేది. 'ఓస్ ఈపాటి దానికి మానసిక నిపుణుల్ని కూడా సంప్రదించాలా దానికి నేను పరిష్కారం చెబుతాను విను' అన్నాడు కాలజ్ఞానితో ఒక మిత్రుడు. ఏమిటో చెప్పమని నేను అసక్తిగా అడిగాను. ఆయనంటాడు, భార్యాభర్తలు అస్తమానం ఒకే మంచం మీద పడుకోవడమెందుకు. ముందు ఎవరి పడక వారు వేరువేరుగా వేసుకోమనండి దాంతో విరహం కలుగుతుంది. కోరికఉన్నా లేకున్నా ఒకే పడకమీద అవసరం ఉన్నా లేకున్నా రాసుకుంటూ పడుకుంటె అది దున్నపోతు మీద వర్షం పడ్డట్లుగా ఉంటుంది. స్పర్శ సుఖం ఉండదు. పోట్లాడుకోడానికి అదే పడక, ప్రేమగా మాట్లాడుకోడానికి అదే పడకైతే ఎలా. సరసం వేరు, విరసం వేరు అని. వాత్స్యాయనుడే ఉండిఉంటే పై సమస్యకు ఏం పరిష్కారం సూచించే వాడో. శంకరాచార్యుల వారివిషయంలో సెక్స్ పరిజ్ఞానంలేక పోవడంకూడా ఒక అనర్హత అయింది. అందుకే మహాత్ముడు సెక్స్ సమస్యలుకూడా సుదీర్ఘంగానే చర్చించాడు. దంపతుల మధ్య సంభోగమన్నది, కేవలం సంతానోత్పత్తికే కాని ఇతరత్రా ఆ శక్తినివృథా చేయకూడదన్నది ఆయన అభిప్రాయం. అందుకే ఆయన పిల్లల్నికనే కార్యక్రమం పూర్తయ్యాక కస్తూర్బాతో బ్రహ్మచర్యం పాటించి ఆమెలో మాతృత్వాన్ని దర్శించాడట. గాంధీజీ అనుయాయి అయిన శ్రీ మొరార్జీదేశాయ్‌కూడా అదే పని చేశాడు. వారికున్న నిగ్రహ శక్తి అందరికీ సాధ్యమా? అన్నది ఒక ప్రశ్నకాగా అసలు భారతదేశంవంటి

పేదదేశంలో జనానికి అందుబాట్లోనున్న ఏకైక వినోదం సంభోగమే కదా! క్లబ్బుల్లో ఆడిపాడి త్రాగి తందనాలాడి కాలక్షేపం చేసే హోదా సగటు భారతీయునికి ఉందా అన్నది మరో ప్రశ్న. మతకలహాల వల్ల తరచుగా కర్ఫ్యూ అమలుజరిగే ఒకప్రాంతంలో సర్వే జరిపితే మిగతా ప్రాంతాలకన్నా అక్కడ సంతానోత్పత్తి ఎక్కువగా ఉన్నట్లు పరిశోధనల్లో తేలిందట. అంటే కాలక్షేపం కోసం వినోదం కోసం దంపతులు పేకాటలా సంసార సుఖాన్ని వాడుతున్నారనే కదా! అదికూడా వద్దంటే మరిన్ని క్రొత్త సమస్యలు వస్తాయి మరి. అట్లని సంసార సుఖాన్ని పాశ్చాత్యుల్లా విచ్చలవిడిగానో, లేక ప్రకృతి విరుద్ధంగానో నిర్వర్తిస్తే మనమూ డాక్టర్లను అశ్రయించాల్సి వస్తుంది. తస్మాత్ జాగ్రత్త!

కొసమెరుపు:- ఒక ప్రకృతి డాక్టర్ దగ్గరకు వెళ్ళిన యువకుడు అయ్యా! దాంపత్య సుఖం ఎన్ని రోజులకొకసారి అనుభవించాలో సెలవిస్తారా? అంటే ఆయన సంవత్సరం కొకసారి అన్నాడట. అయ్యా అదేమిటండీ! అంటే ఆరుమాసాలు అనీ, అది సాధ్యమా అంటే మాసం కొకసారి అన్నాడట. ఉప్పుకారం తింటున్నాం కదా అంటే వారం కొకసారి అన్నాడట. ఇంకా కొసరబోతే డాక్టర్ గారు సారీ అని లేచిపొయారట.

# మొగమాటానికిపోతే

అన్నివేసి చూడు నన్ను వేసి చూడు అంటుందట ఉప్పు. నిజమే ఎన్ని వేసినా కూరలో ఉప్పు లేకపోతే తినలేంకదా. అందుకే ఉప్పుకంత డిమాండ్ . మహాత్ముడు ఎన్ని సత్యాగ్రహాలు చేసినా ఉప్పు సత్యాగ్రహమే దేశాన్ని కదిలించింది, ఆంగ్లేయుల్ని హడలగొట్టింది.

ఉప్పు లాంటిదే డబ్బుకూడా. డబ్బున్న వాడికే సమాజం ఎక్కువ విలువ నిస్తుంది. ఆ జబ్బు మా మిత్రుడికి కొంచెం ఎక్కువ మోతాదులోనే ఉంది. అయిదు రూపాయల నుండి అయిదువందల వరకు చందాలిచ్చిన వారందర్ని వేదిక మీదికి పిలిచాడు. ఖాదీ బట్టల వారిని, కార్లలో వచ్చిన వారిని, గడ్డాలు, మీసాలు పెంచిన వారిని, గల్లీ దాదాలను భయానకి కొందరిని భక్తికి కొందరిని పిలిచి పీట వేశాడు. మొగమాటానికి పోతే కడుపొచ్చినట్లు వేదిక ఆఫీసు టైంలో సిటీ బస్సులా కిటకిటలాడిపోయింది. అసలు ఎవరి సన్మానం కోసం ఆ కార్యక్రమం ఏర్పాటయిందో వారంతా క్రింద ఉన్నారు. సరేలే వాళ్ళను సమయానికి పిలిచి పూలమాల వేసి శాలువా కప్పితే చాలనుకున్నాడు. ఉపన్యాసాల ఊకదంపుడు కార్యక్రమానికి నాందీ వాచకం పలికాడు.

బ్రతికుంటే బలుసాకైనా తినొచ్చు, తెలుగు సినిమా పాటలైనా వినొచ్చు ఈ ఉపన్యాసాలు మాత్రం భరించలేము సన్మానం లేకున్నా పర్వాలేదని సగం మంది కళాకారులు చల్లగా జారుకున్నారు. మిగతా సగం మంది కూడా బాయ్‌కాట్ అస్త్రం ప్రయోగించేసరికి ఆదరాబాదరాగా చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు నిర్వాహకుడు వేదిక మీదున్న కొందరు యువనాయకుల్ని క్రిందికి వెళ్ళమన్నాడు. క్రింద నున్న కళాకారుల్ని వేధిక పైకి రమ్మన్నాడు. దాంతో పాత అసమ్మతీయులు సమ్మతీయులైతే క్యాబినేట్ లో నుండి డ్రాపైన

వారు సి.ఎం.గారిపైకి కారాలు మిరియాలు నూరినట్లు నిర్వాహకునికి తమ నిరసన తెలిపారు. అంతా కలసి కిరికిరిల మధ్య కార్యక్రమం పూర్తయిందనిపించారు. కాని మా నిర్వాహక మిత్రుడు మాత్రం తెగబాధపడిపోయాడు. నేనాయనకో పిట్టకథ చెప్పాను. వెనకటికో పెద్దమనిషి ఒక కుంటి గాడిదపైనెక్కి కొడుకును తోలమన్నాడట. దారినపోయే దానయ్యొకతను ఏమయ్యా ''కుర్రవాన్ని నడిపిస్తూ నీవు గాడిద నెక్కుతావా'' అంటే సరేనని క్రిందికి దిగి కొడుకును గాడిదపైకెక్కించాడు. త్రోవలో మరో మీనయ్య ''పాపం ఆ గాడిద కుంటుతుంటే దానిపై కొడుకును కూర్చొపెట్టడం న్యాయమా'' అన్నాడట. కొడుకును కూడా క్రిందికి దిగమని గాడిద వెనక నడువసాగారిద్దరు. ఇంకొక సోమయ్య ఎదురై ''పాపం ఆ గాడిద నడవడానికి ఎంత కష్టపడుతుంది మీరిద్దరు కలిసి దాన్ని మోయొచ్చుకదా'' అంటే తండ్రీ కొడుకు లిద్దరు కలిసి అంతపనీ చేశారు. నీవు చేసింది అదే ఖచ్చితమైన సభా కార్యక్రమం లేకుండా వేదిక నెక్కిన వారిని దింపి, దింపినవారిని ఎక్కించి వారు చెబితే వారి మాట, వీరు చెబితే వీరి మాటగా కార్యక్రమాన్ని నడిపించావు అన్నాను. ఆయన మొగం ముడుచుకుని వెళ్ళిపోయాడు.

కొసమెరుపు: ఇచ్చట మంచి నెయ్యి అమ్మబడును అని ఒకతను బోర్డు పెట్టాడట. ''అమ్మేదిచ్చటే కదా ఆమాటెందుకని'' ఎవరో అంటే మొదటి పదం ''మంచి నెయ్యి కాకపోతే ఎవరన్నా చెడ్డనెయ్యి అమ్ముతామంటారా'' అని మరొకరంటే రెండవ పదం ''అమ్మేది నెయ్యేకదా మళ్ళీ చెప్పడం దేనికి'' అంటే మూడో పదం కూడా తీసేశాడట. ఇంతలో ఒక పెద్దమనిషి వచ్చి ''ఎంతకు అమ్ముతారండీ ఈ షాపును'' అన్నాడట.

# పెరిగే గడ్డాలు-కొరిగే ప్రకటనలు

గడ్డాలు మీసాలున్న మగవాళ్ళను చూస్తేచాలు, చాలామంది ఆడవాళ్ళకు ఒళ్ళు మండిపోతుందట. నున్నగా గడ్డం గీసుకున్న మగవారినే వారు ఇష్టపడతారట. అంతే కాదు గడ్డాలు పెరగటం వల్ల దురద చర్మ వ్యాధులు తద్వారా చికాకు ఎక్కువౌతున్నాయట. అందుకే ప్రతిరోజు నున్నగా గడ్డం గీసుకొమ్మని భారత దేశంలో బ్లేడ్లు తయారుచేసే కంపెనీల వారంతా కలిసి ఇటీవల ఒక పత్రికాప్రకటన విడుదల చేశారు. ఈ కంపెనీ వారు ఇంతగా బాధపడిపోవడానికి కారణం మన దేశంలో గడ్డాలు పెంచేవారు ఎక్కువైపోవడం వల్లనేనని చెబుతున్నారు.

యూరోపుదేశాల్లో తలసరి బ్లేడ్ల వాడకంతో పోలిస్తే మనం చాలా వెనకబడి ఉన్నామని కూడా గొప్ప పరిశోధన తర్వాత పైకంపనీల వారు తేల్చిచెప్పారు.

బ్లేడ్ల కంపెనీలవారికి వినియోగదార్ల జేబులుక్షవరం చేయడం మాత్రమే తెలుసు. వారికి పిసరంత పిచ్చికాకపోతే యూరోపు దేశాల వారితో పోలిస్తే మనం దేంట్లోమాత్రం ముందున్నామని. గడ్డాలు గీసుకోవడమే కాదు ఆటల్లో పాటల్లో తినడంలో పడుకోవడంలో అన్నిట్లో వాళ్ళే రికార్డులు బ్రేకు చేస్తున్నారాయే, పిల్లల్ని కనిపడేయడంలో మనం ముందున్నామన్నది అందరూ అంగీకరిస్తున్న విషయం.

పూర్వం ఋషులు, మునులు ఉన్న **కాలంలో** పొడవాటి పొడవయిన గడ్డాలు పెంచి ఆ రంగంలో మన దేశాన్ని చాల**ముందు**కు తీసుకుపోయారు. అప్పుడేకనక గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ **ఉండిఉంటే** ఈ రోజు వరకు ఎవరూ ఆ రికార్డులను బయటిదేశాలనుండి బ్రే**క్ చే**సేవారు కాదు. రంభలు, ఊర్వశులెందరో సదరుమునుల తపస్సులను **భంగంచే**యగలిగినా వారి గడ్డాలు మాత్రం నిర్విఘ్నంగా పెరిగాయి.

ఓసేరంభా! నా తపస్సునెందుకు భంగంచేశావే అని విశ్వామిత్రులవారు మండిపడితే ఆమె ఏమాత్రం బెదరకుండా ''స్వామీ! మీ తపోభంగం సంగతి అలా ఉంచండి. నా అందానికి మీరు కామాంధులై నన్ను మానభంగం చేశారు దాని సంగతేమిటి'' అని అందట. పాపం విశ్వామిత్రుడు మాత్రం ఏం జవాబుచెబుతాడు. ఈ రోజులకువలె రేప్ కేసులు లేనందున సంతోషించి, గడ్డం పీక్కుంటూ వెళ్ళిపోయుంటాడు, అది వేరేవిషయం.

మన తిరుమల తిరుపతి వెంకన్నకు భక్తులగడ్డాలు మీసాలపై చాలాప్రేమ కాబోలు శుభ్రంగా మొక్కులు చెల్లించుకుంటేనే మంచి వరాలిస్తాడని నమ్ముతాం మనం. అందుకే కొండమీది మంగలి ఎన్ని గాట్లు వేసినాసరే తలవంచి భరించడం అలవాటైంది.

జైలుకుపోయిన వారో ఆస్పత్రిలో చేరినవారో పెళ్ళాంపోరు పడలేనివారో గడ్డాలు పెంచడం రివాజు. రోజు ప్రొద్దునే రేజర్ బ్లేడ్ తో తమతోలు తాము వొలుచుకోవడం ఇష్టంలేని వారుకూడా గడ్డాలు పెంచుతున్నారు. దానికి కొందరు ఫేషన్ కలరిచ్చినా మరి కొందరు తీరికలేని ప్రొఫెసర్ లా, శాస్త్రవేత్తలా, భావకవిలా ఫోజు పెట్టినా పెట్టవచ్చు. ఇంకోరకం గడ్డంగాళ్ళున్నారు వారు అభినవ దేవదాసులు. దేవదాసు కేవలం ప్రేమదాసుడై సీసాకే కాదు గడ్డానికి కూడా దాసుడై పోయాడుమరి.

మ్రింగమెతుకు లేకున్నా మీసాలకు సంపెంగా అని వెక్కిరించారు నాడు. నిమ్మకాయలు నిలిచే మీసాలు పెంచేవారు నేడు కూడా లేకపోలేదు. కాని వాటిని తగిలించుకుని పల్లెటూర్లల్లో తిరిగితే వీడెవడో కాష్మోరామంత్రగాడని వీపుసాపు చేసిపంపుతారు. తస్మాత్ జాగ్రత్త!

కొసమెరుపు: ''నీ ముద్దుముచ్చటగానే ఉందికాని ఆ గడ్డం మీసాల పోరు మాత్రం భరించలేనందట భార్యామణి. ప్రేయసీ నీ కౌగిలి తీయగానే ఉందికాని నీవు పెంచిన వ్రేలిగోర్లు మాత్రం కత్తుల్లాగుచ్చుకుంటున్నా''యన్నాడట భర్త.

# తెలుగు కవి సమ్మేళనాలకు టికెట్ కొనే రోజులు

ఒక ఉర్దూ మిత్రుడు అప్పుడప్పుడు సరదాగా నాకు కొన్ని ఖండికలు వినిపిస్తుంటాడు. హైద్రాబాద్‌లో మత కలహాలు మామూలేగా. కర్ఫ్యూలో జుల్లో ఫైజ్ అహ్మద్ ఫైజ్ రాసిన ఒక కవిత చదివాడు.

''ఈరక్తపు మరకలు చెరిగి పోవడానికి ఎన్ని కుంభ వర్షాలు కురవాలో'' అని

జౌఖ్ ఒక కవితలో ''ఇప్పుడు భయపడి చనిపోతానంటున్నావు చచ్చినా శాంతి లభించకపోతే అప్పుడెటు వెళ్తావు'' అంటాడు. ఇలా కోట్ చేసుకుంటూ పోతే ఎన్నైనా చెప్పవచ్చు. సూక్ష్మంలో మోక్షం చూపించే గుణం ఉర్దూకవిత్వంలో వుంది. అలతి అలతి పదాలలో అనల్పమైన భావాన్ని చూపే ఉర్దూ కవులు, వారి కవిత్వం పండితుల్ని పామరుల్ని కూడా ఆకర్షిస్తుంది. ఉర్దూ ముషాయిరాలు ఎక్కడ జరిగినా వాటికి జనం విరగబడడానికి అదే కారణం.

స్వర్గీయ దాశరథిగారు ఒక ఉర్దూ ముషాయిరాకు బయలు దేరాడట. రిక్షా బేరం కుదరలేదు. ఒక సాయిబు మాత్రం మీరెంతైనా ఇవ్వండి అని ముషాయిరా వద్ద వదిలాడట. అందుకు కారణం ఆ రిక్షావాలా కూడా ఆ ముషాయిరాకే హాజరవుతున్నాడు కాబట్టి. అంటే ఒక మామూలు రిక్షావాలా కూడా టికెట్టు కొని ముషాయిరాకు హాజరవడం విశేషం. ఈ ఉత్సాహం మన తెలుగు సమ్మేళనాల్లో మచ్చుకు కూడా కనబడక పోవడం విచారకరం. ఎంత గొప్ప తెలుగు కవులు హాజరయే కవి సమ్మేళనాలైనా శ్రోతలు అతి తక్కువగా ఉండడం జరుగుతుంది. మనకు కవిత్వం వినిపించే వారే ఎక్కువ వినే శ్రోతలు తక్కువ.

ఆం.ప్ర. అవతరణ దినోత్సవాల సందర్భంగా ఒకసాహితీ సంస్థ తరపున కవి సమ్మేళనంలో పాల్గొనమని ఆహ్వానిస్తే వెళ్ళాను. మైకుతో సహా ఏర్పాట్లన్నీ సక్రమంగా ఉన్నాయి. కాని శ్రోతలు మాత్రం పదిమంది కూడా లేరు. పూలమాలలు వేయడం, శాలువాలు కప్పడం కాదు. సాహితీ ప్రియులను ఆకట్టుకోవడం ముఖ్యం. అయితే మరునాటి పేపర్లలో మాత్రం ఫోటోలతో

సహా చక్కగా వార్తలు వ్రాశారు. ఎవర్ని మోసగించడానికి యిలాంటి కార్యక్ర మాలు జరుపుతున్నామో మనం ఆత్మపరిశీలన చేసుకోవాలి.

తమకున్న ప్రతిభనంతా ఒకే కవితలో చూపాలని సుదీర్ఘంగా రాయడం, శ్రోతల స్థాయిని అర్థం చేసుకోకుండా వారి స్పందన తెలుసుకోకుండా గ్రుడ్డెద్దు చేన్లో  పడ్డట్టుగా, మొక్కుబడిగా కవితలు వినిపించడం, మనవాళ్ళు చేస్తున్న పొరపాట్లు. కవిత్వంలో అస్పష్టత ఎక్కువకావడం వల్ల సామాన్యులకు అర్థం కావడం లేదు. చదవడం మరీ పేలవంగా ఉంటుంది. వినసొంపుగా సినారేలా చదివేవారు బహుకొద్దిమంది మాత్రమే.

ఇక ప్రభుత్వ పరంగా విశేషించి ఆకాశవాణి, దూరదర్శన్‌లు ఏర్పాటు చేసే కవి సమ్మేళనాల్లో ప్రతిభ కన్నా పలుకుబడి గల వారికే అగ్రస్థానం లభిస్తుంది. వీరి ఆహ్వానితుల్లో ఎప్పుడూ కొంతమంది పేర్లే తరచుగా వినిపిస్తుంటాయి. వీరు కొన్ని వర్గాల కవులను అంటరాని వారిగా దూరంగా ఉంచుతున్నారు.

కుక్క గొడుగుల్లా పుట్టుకొచ్చిన కొన్ని సాహితీ సంస్థలకు కవిత్వం మీద కన్నా కొందరు కవుల బాకాలుగా వ్యవహరించడంలోనే ఆసక్తి ఎక్కువ సన్మానాలకు రేట్లు నిర్ణయించి వీరు సాహితి సాంస్కృతిక వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు.

కొసమెరుపు: తెలుగు కవిసమ్మేళనాలకు సాహితీ ప్రియులతో టికెట్‌లు కొనిపించడం ఎలా అన్న కాలజ్ఞాని ప్రశ్నకు రెండు సూచనలు వచ్చాయి.

1. కవులకు కాదు సమ్మేళనానికి వచ్చిన శ్రోతలకు శాలువాలు కప్పి సన్మానం చేస్తామని ముందుగా ప్రకటించడం.
2. కవి సమ్మేళనంలో విధిగా ఒకరిద్దరు సినిమా నటులు ఉండేలా చూడడం.

# అయ్యప్ప ముసుగులో

బస్సుదిగి ఆఫీసుకు వెళ్తుంటే త్రోవలో మిత్రుడు ఎదురయ్యాడు మాసిన గడ్డంతో నల్లని దుస్తులు ధరించి, కాళ్ళకు చెప్పులు లేకుండా మెడలో జపమాల వేసుకుని ఉండడం చూసి ఆశ్చర్యపోయాను. సన్యాసం పుచ్చుకు న్నాడా ఏమిటని అనుమానం వేసింది. ఆయన్నే అడిగాను ''స్వామిఅయ్యప్ప దీక్షలో ఉన్నాను. శబరిమలై వెళ్తున్నా''నన్నాడు. పెళ్ళికూడా కాలేదు. అప్పుడే ఏంకష్టాలు వచ్చాయంటే పెళ్ళి కాకపోవడమే నన్నాడు. అయ్యప్పనా మంచి సంబంధం కుదురుస్తాడేమోనని ఆయన ఆశ. రాజధానిలో ఉద్యోగం చేస్తున్న నీలాంటి యువకునికి అమ్మాయి దొరకకపోవడమేమిటి కాస్తకట్నం ఆశ తగ్గించుకో అని సలహా యిచ్చాను.

మధ్యాహ్నం లంచ్ సమయంలో ఫోన్ వచ్చింది. బంధువొకాయన ఆస్ప త్రిలో చేరాడట. పరుగుపరుగున వెళ్ళాను. తీరాచూస్తే అతనూ అయ్యప్పే. కాలుకు బ్యాండేజి వేసుకుని బెడ్ మీద పడుకున్నాడు. చేతిలో జపమాల తిరుగుతుంది. ఏమిటి సంగతంటే అయ్యప్ప దీక్షలో ఉండి చెప్పులు వేసుకోక పోవడంవల్ల కాలికి ఇనుపమేకు గుచ్చుకుని సెప్టిక్ అయింది. చావు తప్పికన్ను లొట్టపోయినట్లు తీసివేయాల్సిన కాలును డాక్టర్లు కాపాడారు. అకస్మాత్తుగా ఈ దీక్షేమిటంటే ''వ్యాపారం కలిసి రావడంలేదు, ఫారెస్టువాళ్ళ దాడులెక్కువ య్యాయి. దొంగకర్ర దొరకక సామిల్ దివాళ తీసింది. అందుకే స్వామిశరణం '' అన్నాడు. ఆయన పరిస్థితి నాకు జాలికలిగించింది.

సాయంత్రం ఇంటికి వెళ్ళాను. శ్రీమతి ప్రక్కింటి పానకాలమ్మతో సర దాగా మాట్లాడుతుంది. ఏమిటీ చాల తీరిగ్గా ఉన్నారన్నాను. ''ఏముంది వంటపనిలేదు వారం రోజుల్నుండి ఆయనేవండి పెడుతున్నాడు. హాయిగా తిని కూర్చోడమే'' అంది ఆమె. అదేమంటే పానకాలావుగారు అయ్యప్పశర ణుచొచ్చారు. అయ్యప్పకేమో ఆడవాళ్ళంటే గిట్టదు. వయసులోనున్న ఆడ వారు ఆయన చాయలకు కూడా వెళ్ళగూడదట. దీక్షలో నున్న భక్తులు ఆడవారి చేతివంట కూడా తినగూడదట. పానకాలావుగారే చేయికాల్చుకుని తను ఒకపూట తిని భార్యకింత పెడుతున్నాడు. కఠోర బ్రహ్మచర్యం పాటిస్తున్నాడు. నేల మీద పడుకుంటున్నాడు. చన్నీటి స్నానం చేస్తున్నాడు. ఇవన్నీ సంతానంకావాలని.

కొసమెరుపు: పెరుగుతున్న అయ్యప్పభక్తులను చూసి తిరుమల దేవుడు కలవరపడిపోతున్నాడట. తెలుగుదేవున్నైనా ఆలోచించక మలయాళ దేవుని మాయాలో పడిపోతున్నారని.

# రాద్ధాంత రాజకీయాలు

సాయంం సమయం ఆఫీసు వదిలి ఇంటికి వెళ్ళే ఉద్యోగుల్తో సిటీ బస్సులు రద్దీగా ఉన్నాయి. గుంపులో చొరబడి బస్సు ఎక్కాను. బస్సులో ఒక అరవయేళ్ళ ముసలాయన ఇరవయేళ్ళ కుర్రాడితో కుస్తీపడుతున్నాడు. చూడబోతే తాతామనవల్లా ఉన్నారు. సీటు గురించిన గొడవ. ''మా స్నేహితుని కోసం ఆపిన సీట్లో నువ్వెలా కూర్చుంటావు'' అంటాడు యువకుడు.

''సీట్లన్నీ నువ్వొక్కడివే రిజర్వు చేసుకున్నావా'' అంటాడు పెద్దమనిషి.

''ఏదో పోనిరా ముసలాడుకదా'' అన్నాడు యువకుని స్నేహితుడు కల్పించుకుని.

పెద్ద మనిషికి అరికాలిమంట నెత్తికెక్కి నట్లైంది.

''నన్ను ముసలాడంటావా'' అని ఉగ్రుడయ్యాడు.

''అవును నీవు ముసలాడివి కాక మరేమిటి'' అని యువకుని వాదన.

అసలు సీటు విషయం వెనుక బడిపోయింది. వయసు తగువు ముందుకొచ్చింది. ఇలా ఉంటాయి జగడాలు. వాటికి కారణాలు వెతకడం దండగ.

''జగడం ఎట్లా వస్తుందని'' బిక్షానికి వచ్చిన జంగాన్ని అడిగిందట ఒక ఇల్లాలు ''బిక్షమేయవే బొచ్చుముండా'' అన్నాడట జంగమదేవర. దాంతో రెచ్చిపోయిన ఇల్లాలు నానా శాపనార్థాలు పెట్టిందట. ''అమ్మా జగడం ఇలాగే పుడుతుందని సవినయంగా మనవి చేశాడట ఆజంగమ. అదీ కథ. రెండు పక్షాలు నోరుపారేసుకుంటేనే రెచ్చిపోతేనే గొడవలు వచ్చేది. అంతేకాని కేవలం ఏదో ఒక పక్షమే గొడవలన్నిటికి కారణమని అనడం తప్పేనేమో.

ఇంతకీ చెప్పొచ్చేదేమంటే మన చట్ట సభల్లో అసలు విషయాలపై చర్చల కన్నా ఎక్కువ సమయాన్ని వ్యక్తిగత విషయాలపై వృధాచేస్తున్నారని విమర్శకుల అభిప్రాయం.

ఎన్నో ముఖ్యమైన బిల్లులపై చర్చలు ప్రక్కకునెట్టి అనవసర విషయాల్లో ఆవేశకావేశాలు పెంచుకుని మొక్కుబడిగా సమావేశాలు ముగిస్తున్నారు. ఇందుకు ప్రతిపక్షమే కారణమని అధికార పక్షీయులంటే తప్పు అధికార పక్షానిదేనని ప్రతిపక్ష పార్టీల ఆరోపణ. నిజానికి తప్పు పై ఇద్దరిదీకాదు అలాంటి వారికి ఓట్లు వేసిన ప్రజలందరిదీ.

కొసమెరుపు: ఒక జన్మదినోత్సవ సభలో మాట్లాడుతూ ప్రముఖ నాయకుడు శ్రీ గౌతు లచ్చన్న గారు ''ఈ రోజుల్లో సిద్ధాంత రాజకీయాల కన్నా రాద్ధాంత రాజకీయాలే ఎక్కువ'' అన్నారు. అది అక్షరాలా నిజం.

# చెప్పుకుంటే సిగ్గుపోయే పనులు

చెప్పుకుంటే సిగ్గుపోయేపనులు చేసినవి చాలా ఉన్నాయ్. అర్ధరాత్రి పెళ్ళాం పిలుస్తున్నా కాదని కవిత్వం రాయడం అన్నాడొక సందర్భంలో కుందుర్తి. రాసిన కవిత్వాన్ని స్వంతంగా ప్రింటు చేసుకోవడం అంతకన్నా సిగ్గుచేటైనపని. వేసిన పుస్తకాన్ని అందులోనూ కవిత్వాన్ని అమ్ముకొవాలనుకోవడం మరీమరీ కష్టమైనపని

కొనబోతే కాగితం ధర విపరీతం. అచ్చయే ప్రతి పేజీకి ఒకసారైనా ప్రింటింగ్ ప్రెస్‌ల చుట్టు తిరిగితేగాని పని జరగదు. అభిప్రాయాలసేకరణకని పండితుల చుట్టూ, బొమ్మలు గీసివ్వమని ఆర్టిస్టుల చుట్టూ తిరిగేసరికి రచయిత కాళ్ళరిగి పోతాయి. తీరా పుస్తకం తయారయ్యాక ఆవిష్కరణ ఆదుర్దా. అప్పటికే డబ్బులుజేబులో మిగలవు. మళ్ళీ ఆహ్వాన పత్రికలకు, పూలమాలలకు, హాలుకు అతిధుల్ని తీసుకురావడానికి కావాలంటే ఏదో ఒక భజన సంఘాన్ని ఆశ్రయించక తప్పదు.

ఇటీవల కీ.శే. దాశరధిగారి కవితా సంకలనం కేవలం అయిదు వందల ప్రతులే వేశారని విని ఆశ్చర్యపడక తప్పలేదు. అందుకని యువకవులు రెండువందల ప్రతులు వేసుకుని సాహితీ బంధు బృందానికి పంచుకుంటే సరి అని కాకలు తీరిన ఒక వృద్ధకవి సలహాయిచ్చాడు. దిన వార పక్ష మాస పత్రికలెన్నిటికి పంపినా ఒక యాభై ప్రతులకన్నా ఎక్కువ ఖర్చుకావు. వాటిపై సమీక్షలు చూద్దామని పత్రికా కార్యాలయాలకు వెళితే ''మాకు సమయం లేదు స్వామీ ఆ సమీక్షకూడా మీరేరాసివ్వండనే సమాధానాలు కూడా రావచ్చు.

మాదొక అనాధ గ్రంధాలయం మీ అమూల్యమైన పుస్తకాన్ని మాకు ఉచితంగా పంపితే కృతజ్ఞులం అని రాసే మహానుభావులు కొందరు. పుస్తకం ఉచితంగా పంపొచ్చునేమోకాని పోస్టేజి కూడా రచయితే పెట్టుకోవాలా అన్నది ప్రశ్న. విక్రేతలకు పుస్తకాలు యిస్తే అమ్ముకుని కూడా మీ బుక్స్ లోపలెక్కడో ఉన్నాయండి చూడాలి మీరు మళ్ళీ రండి అని తప్పించుకునేవారు చాలామంది ఉన్నారు. ఒకప్పుడు లైబ్రరీలవారు ఎంతో ఉదారంగా పుస్తకాలు కొనే వారు. వారి ఆమోదం పొందడమే ఒక పైరవీ అనుకుంటే వాటిని జిల్లా లైబ్రరీలకు అమ్ముకోవడం మరో పెద్ద పైరవీ అవుతుంది.

కొసమెరుపు: నాకవితా సంకలనం పుస్తకాలు ఒక్కటి కూడా కనబడడం లేదేమిటే అన్నాడు కవిగారు. ఎలుకలు తింటే ఏమొస్తుందని నేనే పాత కాగితాలవానికి అమ్మాను. కిలో వంకాయలు కూడా రాలేదు అని జవాబిచ్చింది భార్య.

# బిక్షాందేహి

బిక్షకుల బెడద ఒక్క భారత దేశంలోనేకాదు చాలా దేశాల్లో ఉంది. కమ్యూనిష్టు దేశాల్లో తప్ప ధనవంతమైన దేశముగా, అగ్రరాజ్యాంగా పరిగణించబడుతున్న అమెరికాలో కూడా బిచ్చగాళ్ళున్నారు. అయితే వీరు ఘరానా బిచ్చగాళ్ళు, సూటు బూటు వేసుకుని యాత్రికులు విరివిగా వచ్చే పెద్ద హోటళ్ళ దగ్గర పొంచి ఉంటారట. అమెరికా పర్యటించి వచ్చిన ఒక జర్నలిస్టు తన అనుభవాల్లో యిలా రాసుకున్నారు. ''నేను హోటల్లో కూర్చుని తింటున్నాను. సూటుబూటులో ఉన్న ఒక వ్యక్తి భోజనం పెట్టించండి, గత మూడు రోజుల్నుండి నేను నీటితోనే పొట్ట నింపుతున్నాను అన్నాడు. ఆయనను చూస్తే నాకు జాలి ఆశ్చర్యం రెండూ కలిగాయి. భారతదేశములో బిచ్చగాళ్ళు చింపిరి గుడ్డల్లో ఉండి, గొంతు చించుకుంటూరు. అమెరికాలో వారి సహోదరులు పెద్దమనిషి వేషములో వచ్చి మర్యాదగా అడుక్కుంటారు. అంతే తేడా. నేనాయనకు రెండు రొట్టెలు తెప్పించి యిచ్చాను. ఆవురావురు మని తింటూ ''మీ దేశం చల్లగా ఉండుగాక'' అన్నాడు. ఆయనకు మనది వేడి దేశమని తెలియదు కాబోలు.

దక్షిణాదిలో తమిళనాడు దేవాలయాలకు నిలయం, అంతే కాదు బిచ్చగాళ్ళకుకూడా. ప్రతి పుణ్యస్థలం దగ్గర, ముందు బిక్షకుల దర్శనం చేసుకుని, వారిని సంతృప్తి పరిస్తేగాని భగవంతున్ని చూడలేము. గుడి నుండి బయటకు వచ్చి ప్రసాదం తింటూ భక్తులు కంటబడితేచాలు ఒక ప్రక్కనుండి బిచ్చగాళ్ళు వచ్చి చేరతారు. అదరగొడితే కోతులు పోతాయిగాని, మనుజులైన బిచ్చగాళ్ళు మాత్రం పోరు. వీరు వచ్చి కాళ్ళు గనక పట్టుకుంటే చేతిలో యే తినువస్తువున్నా యిచ్చుకునేదాకా వదలరు. వీరి బెడద వదిలించుకోడానికి మహారాష్ట్ర ప్రభుత్వం ఒక శాసనం ద్వారా బొంబాయి నగరంలో బిక్షాటన నిషేధించి బిక్షకులందర్ని పట్టి బంధించి బిక్షుక గృహాలకు తరలించింది. బిక్షుకులు ఈ గృహాలలో ఉండడానికి యిష్టపడటం లేదు. వారు బయట వ్యభిచారం త్రాగుడు, దొంగతనాలకు అలవాటుపడి ఉన్నారు. అంతేకాకుండా బిక్ష గృహాలలో చేతనైన పనులు విధిగా చేయవలసి ఉంటుంది. బిచ్చమెత్తి తిని

ప్రొద్దంతా సోమరిగాపడుకోవడానికి అలవాటు పడ్డ వీరు పనులు చేయరు.

వంశ పారంపర్యంగా బిచ్చమెత్తే కుటుంబాలు యెన్నో ఉన్నాయి. ఇల్లు వాకిలి, పొలము పుట్ర ఉండికూడా వీరు బిచ్చమెత్తడానికి వెనుదీయరు. అంతేకాక అది తమ వృత్తి అని సగర్వంగా చెప్పుకుంటారు. కొందరు గారడీలుచేసి గంగిరెద్దుతో ఆటలాడించి కోతులతో గంతులేయించి బిచ్చమడుగుతారు. ఒకరి నుండి ధర్మం ఆశిస్తున్నప్పుడు మనం కూడా చేతనైంది చేసి చూపాలన్నది వారి ఆశయం.

రోడ్డు ప్రక్కన ఉండే గ్రుడ్డి తాత గళమెత్తి కాలజ్ఞాన తత్వాలు పాడుతుంటే వినాలనిపిస్తుంది. అడగకనే ధర్మం చేయాలనిపిస్తుంది. అలాకాకుండా తలవాకిట్లో నిలబడో బస్‌స్టాండ్లో కాళ్ళు పట్టుకునో గావుకేకలు పెడుతూ, తమకు అడిగే హక్కు ఉందన్నట్టుగా జబర్దస్తీ చేసే బిచ్చగాళ్ళను చూస్తే ధర్మం చేయాలనిపించదు, రెండు వాయించాలనిపిస్తుంది. అంటువ్యాధులు ఉన్నవారు అసహ్యంగా కనిపించే బిచ్చగాళ్ళు తము యేం చేసినా యెవరూ చేయిచేసుకోరన్న మొండిధైర్యంతో యెందుకైనా సాహసిస్తారు.

అంగవైకల్యం, వృద్ధాప్యం వ్యాధుల్తో బాధపడే వారికి ధర్మం చేయాలన్నా చేయాడుతుంది. కాని అంగ సౌష్టవం కలిగి, కష్టపడగలిగే వారు కూడా సోమరులై బిచ్చమడుగుతుంటే ధర్మం చేయడం న్యాయం గాదు. వీరిని గట్టిగా మందలించి స్వయంగా కష్టపడి బ్రతకండని ప్రోత్సహించడము మంచిది.చెరుకు, వరి నాట్లు వేసే కాలంలో వ్యవసాయదారులు కూలీలు దొరకక బాధపడడం అందరికీ తెలిసిందే. వెళ్ళి ఆ పని చేసుకొండని చెబుతే వీరు వినిపించుకోరు. ఇల్లిల్లు తిరిగి ప్రతి మనిషితో తిట్లు పడడానికి వీరు అలవాటుపడ్డారే తప్ప కష్టపడడానికి ముందుకు రావడంలేదు. యిలాంటి వారిని లొంగదీయడానికి, వీరి శక్తి దుర్వినియోగం కాకుండా చూడడానికి, అది దేశాభివృద్ధి కార్యక్రమాల్లో వినియోగపడేట్లు చేయడానికి శాసన సంబంధమైన కట్టుబాటు అవసరము. దేశమంతటా ఉన్న బిక్షకులకు వర్తించేలా కేంద్ర ప్రభుత్వం ఒక సమగ్రశాసనం చేయడం అత్యవసరం.

కొసమెరుపు: అమ్మా బిక్షం వేయమని అరిచాడో ముదుసలి వాకిట్లో నిలబడి. ఇంట్లో ఎవరూ లేరు పోనాయనా అంది ఓ నడివయస్కురాలు. మనుష్యులు కాకపోతే ఓదయ్యమైనా ఉందిగా అన్నాడు వాడు కోపంగా.

# పుణ్యం వేటలో పాపాల మూటలు

పక్కింట్లో పాముకనబడిందట. అదియేరాత్రి వచ్చి తమనుకుట్టి చంపుతుందోనని ఇంటివారంతా రాత్రి నిద్రనేపోలేదు. మరునాడు గృహ యజమాని వెతికివెతికి ఒక పాములవాన్ని పట్టుకొస్తే వాడు పుంగి ఊదిఊది చివరకు ఒక పామునైతే పట్టాడుకాని అది నిజంగా ఇంటివారు చూసిన పామేనా అన్నది అందరికీ అనుమానమే. పాముల వాడు తన బుట్టలోనున్న ఒక పామునే వదిలి, మళ్ళీ పట్టాడని మరొకరన్నారు. పట్టినపాము ఇదా అదా అన్న మీమాంస వదలి ఆ ఇల్లాలు దాన్ని తక్షణం చంపేయాలని పట్టుబట్టింది. ఆమె భయమేమిటంటే పాము పగబడుతుందట. ఆ ఇంటివారే తనను పట్టించారని ఎన్నడో ఒకనాడు పాములవాని బుట్టనుండి తప్పించుకుని అది వస్తుందని అందుకని దాన్ని చంపమని కోరింది. సరే యాబయికి బదులు వంద పాములవాడు తన చార్జీలు వసూలుచేసుకుని నిర్దాక్షిణ్యంగా ఆ పాము చర్మం ఒలుచుకుని చంపి మరీ వెళ్ళాడు. ఆ పామును చంపించిన పాపం తననే అంటుకుంటుందని ఆమహాఇల్లాలు పదిపైసలబిల్లతెచ్చి చచ్చిన పాము నోట్లో పెట్టి మరీ దగ్గరుండి దాని దహనసంస్కారాలు జరిపించింది. ఆ మరునాడే ఇన్ని పాలు తీసుకెళ్ళి ఓపుట్టలో కూడా పోసొచ్చి అప్పుడు నిశ్చింతగా ఉండగలిగింది.

ఇదీ మనవాళ్ళ జీవకారుణ్యం. మనకెంత దైవభక్తో, అంతటి క్రూరులం మనం. దేవున్ని పూజిస్తే చాలు ఎన్ని పాపాలు చేసినా చెల్లుతుందన్నది మన విశ్వాసం. పాము పది చోట్లకు వెళ్తుందని ఊరుకోలేము. మనిషి తప్ప ఈ భూమి మీద మరోప్రాణి బ్రతకలేని పరిస్థితిది. మనిషి తన సుఖం కోసం జంతువుల్ని, పక్షుల్ని క్రిమికీటకాలన్నింటిని చంపి తినడం నేర్చుకున్నాడు. గొర్లుతినేవాడొకడయితే బర్లుతినేవాడు మరొకడు. తినేవిషయాన్ని కొంతవరకు సమర్థించుకో గలిగినా పుణ్యంకోసం జంతువుల్ని బలిచ్చేవారిని మాత్రం క్షమించలేం

అంజయ్యగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు కప్పలబెకబెకల మొరవిని వాటిని చంపి అమ్ముకునేవారిపై ఆంక్షలు విధించాడు. ఇప్పటికే ఎన్నో అపురూపమైన పశుపక్ష్యాదులు నశించిపోయాయి. మరికొన్ని జంతు ప్రదర్శన శాలలకే పరిమితమయ్యాయి. ఇంకో శతాబ్దికాలం తర్వాత మనం వాటి బొమ్మలను మాత్రమే చూసి సంతృప్తిప డాల్సి వస్తుందేమో మరి.

కొసమెరుపు: తన స్వార్థం కోసం మనిషి పశు పక్ష్యాదులను చంపితే, ఆ ప్రతీకారాన్ని క్రిమి కీటకాలు మనిషి మీద తీర్చుకుంటున్నాయి.

# తిండిపోతులు

''ప్రొద్దున లేవగానే కాఫీ, కాస్సేపు పేపర్ తిరగేసే సరికి టిఫిన్ రడీ. వెనువెంటనే టీ, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం చిరుతిండి, రాత్రి డిన్నర్ ఆమె సూపర్విజన్‌లో చేయాల్సిందే. ఇవన్నిటికితోడు మధ్య మధ్య వచ్చి పోయేవాళ్ళ కోసం నాలుగైదు టీ కప్పులైనా ఖాళీ చేయాల్సివస్తు ంది. పెళ్ళైనప్పుండీ యిదీ నా భోజన కార్యక్రమం. ఇలాగైతే నేను ఆరు మాసాల్లో ఆబోతునై పోయే ప్రమాదముందని హెచ్చరించినా మా ఆవిడ వినడం లేదు. ఏం చేయాలిరా బాబూ'' అంటూ వాపోయాడు నా బాల్యమిత్రుడు.

వెంటనే ఆమెను అమ్మగారింటికి పంపించి నీవు ఓ నెలకోసం ప్రకృతి చికిత్సాలయంలో చేరిపొమ్మని సలహాయిచ్చాను. వాడికి నా రెండవ సలహానచ్చి ంది కాని భార్యా వియోగానికి మాత్రం ససేమిరా ఒప్పుకోలేదు. అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎలా నీ పెళ్ళాం ప్రక్కనే ఉంటే నీ మేత కార్యక్రమం నిరాటంకంగా సాగుతుంది. కొంతకాలం వియోగం ఉంటేనే దేవి మజా అయినా తెలిసేది. కాబట్టి నువ్వొక్కడివే ఆస్పత్రిలో చేరి శరీరం బరువు తగ్గించుకోమని సలహా యిచ్చి బయట పడ్డాను.

వారం రోజులు తిరగకుండానే బేగం పేట ప్రకృతి చికిత్సాలయం నుండి నాకో ఉత్తరం రాశాడు. నా సలహా ప్రకారం వాడు ఆస్పత్రిలో చేరినందుకు సంతోషించాను. కాని నాకు వాడిచ్చిన ఉచిత సలహానే నన్ను యిరకాటంలో పెట్టింది.

''ఏకభుక్తియోగి, ద్విభుక్తి భోగి, త్రిభుక్తి రోగి అంటున్నారు' ప్రకృతి డాక్టర్లు. నాకు తెలిసినంత వరకు నీవు కూడా చివరి క్యాటగిరిలోనే వస్తావు. కాబట్టి తక్షణమే యిక్కడికి వచ్చేయ్. ఇద్దరం కలిసి మెలిసి యోగులమై పోవచ్చు. ఏంచక్కా పచ్చి కూరగాయలు నూనె అంటని రొట్టెలు, మసాలాలు లేని తిండి తిని చన్నీటి స్నానాలు చేసి సంపూర్ణారోగ్యవంతులమై పోవచ్చు. బ్రతకడానికి తినాలి కాని తినడానికే బ్రతకకూడదని మా గురూజీ చెప్పాడు. నీ రాక కోసం ఎదురు చూస్తాను'' అని రాశాడు.

కొసమెరుపు: మన శరీరారోగ్యాన్ని కాపాడుకోడానికి మూడు మార్గాలు న్నాయి. 1. హవాకాన (గాలి) 2. దవాకాన (మందు) 3. దువాకాన (భగవంతుని ఆశీస్సులు) అని సర్వోదయ నాయకుడు ప్రభాకర్‌జీ ఉవాచ.

# ఒక మంచిమాట

నాకో మిత్రుడున్నాడు. వాడికెప్పుడూ వంకర మాటలు మాట్లాడడం అలవాటు. వాడికి అప్పు కావలసి ఒకరోజు ప్రొద్దునే నా దగ్గరకు వచ్చాడు. ఇద్దామని మనసులో ఉన్నా అవసరం నిగ్గు తేల్చడానికి కొంచెం గుచ్చి గుచ్చి అడిగాను. అంతే వాడికి కోపమొచ్చింది. నువ్వు నాలాంటి దరిద్రుడివే అని తెలిసి అడగడం నాదే తప్పు అని రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు.

వాడి మాటల్లో ఆత్మనిందా పరనిందా రెండూ ఉన్నాయి. రెండూ తప్పే. ఒక మంచి మాట మాట్లాడితే వాని అవసరం తీరేది. నోరు మంచిదైతే ఊరంతా మంచిదని సామెత. మన మాట మంచిదైతే అందరూ మనవారే.

మంచిమాటలు ముత్యాల మూటల్లాంటివి. మంచిగా మాట్లాడి నమ్మించి మోసగించాడు అంటారు. అంటే మంచిమాటల్లో నమ్మకం, విశ్వసించే గుణం ఉందన్నమాట. కానీ నిజాయితీ లేని మాటలు నీటిమూటలతో సమానం. మాటలు కోటలు దాటినా మనిషి గడప దాటడంటూరు. కోతల రాయుళ్ళను గురించి నిజాయితీ లోపించిన మాటలు తాత్కాలికంగా పనిచేసినా అందులోని నైజం త్వరలోనే బయటపడి పోతుంది. అందుకే మంచిహృదయం కలవాడే మంచిమాటలు చెప్పగలడన్నారు పెద్దలు.

మనిషిలోని హృదయ నైర్మల్యం, ఆత్మ విశ్వాసం, ధైర్యం మాటల విలువ ను పెంచుతాయి. ఒక పెద్ద సైనిక శక్తి చేయలేని పనిని ఒక సమయంలో మంచిమాట చేయగలుగుతుంది. విశ్వవిజేత కావాలన్న కాంక్షతో భారతదేశం పైకి దండెత్తి వచ్చిన గ్రీకు రాజు అలెగ్జాండర్ పౌరవరాజైన పురుషోత్తమున్ని యుద్ధములో ఓడించాక ''నిన్నే విధంగా చూడమంటావ్''వని అన్నప్పుడు పురుషోత్తముడు ధైర్యంగా ''ఒకరాజు మరోరాజును చూచినట్లుగా'' అని

జవాబిస్తాడు. అది అలెగ్జాండర్‌ను ఎంతో ప్రభావితున్ని చేస్తుంది. మంచి మాట విలువ అంతటిది.

విలువ లేని మాట రాగం లేని పాట అన్నాడు కవి. రాగంలేని పాట ఎంతసేపు పాడినా వ్యర్థం. అదే విధంగా విలువలేని మాటలు నిలబడలేవు. రోగికి మందులా పనిచేసే శక్తి కూడా మాటలకుంది. కొందరు నమ్మే మంత్ర శక్తి మాటలశక్తే. ఆధునిక వైద్యశాస్త్రం ఒప్పుకుంటున్న హిప్నటిజంలో మాటల ప్రాముఖ్యతే ముఖ్యం.

మంచి తనం మాటలోనే కాదు చెప్పేతీరులో కూడా ఉండాలి. దాన్నే వాక్‌శక్తి అంటారు. వాక్ శక్తి మనిషికి వరప్రసాదం లాంటిది. ఎందరెందరో చక్కగా ఆలోచించగలరు, మరెందరో చక్కగా రాయగలరు, కాని కొందరు మాత్రమే చక్కగా మాట్లాడగలరు. మాట్లాడటమనేది ఒక కళ. నోరున్న ప్రతివారూ ఆ పని చేయలేరు.

మాటలు సూటిగా సూక్ష్మంగా స్పష్టంగా సరళంగా మధురంగా ఉండాలి. ధర్మ ప్రచారకులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు, నాయకులు చివరకు నటులు సేల్సుమెన్‌లు కూడా మంచి మాటకారులు అయిఉండడం అవసరం.

పల్లెటూరి తగాదాలు తీర్చేది మంచి మాటకారులైన పెద్ద మనుషులే. అందులో కొందరిది ఉన్న మాటైతే మరికొందరిది తిన్నమాట. వాస్తవాలను చెప్పేది ఉన్నమాట. ఏదో ఒక పక్షంవారి ప్రలోభానికి లొంగి మాట్లాడేది తిన్నమాట.

ప్రజాస్వామ్యంలో అభిప్రాయ ప్రకటనకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. ప్రజానాయకుడిలో ఎన్ని గొప్ప ఆలోచనలున్నా, వాటిని ప్రజలకు వివరించి వారిని మెప్పించ గలిగినప్పుడే అతడు విజయం సాధించగలుగుతాడు. న్యాయ వాది కోర్టులో ఏమి వాదిస్తాడో అన్నది తరువాత విషయం. ముందు క్లైంటును తన మాటలతో ఒప్పించ గలిగినపుడే గదా కేసు లభించేది.

సత్యమైంది, సుందరమైందీ మంచి మాట. దానికి సమయస్ఫూర్తి కూడా జోడిస్తే దాని విలువ అమూల్యం.

కొసమెరుపు: ఒక అమెరికా పారిశ్రామికవేత్త ప్రధానిని కలిసి అయ్యా మీరు కార్లు తయారు చేయడానికి ఎందుకు శ్రమ పడతారు మాదేశం నుండి దిగుమతి చేసుకోవచ్చుకదా అన్నాడట. దానికాయనే జవాబిస్తూ మీరు పిల్లల్ని కనడానికి ఎందుకు కష్టపడతారు మాదేశం నుండి తీసుకు పోవచ్చుగా అన్నాడట పి.వి.

# సుత్తివేత్తలు

ఒకసారి లింకన్‌గారి వద్దకు కొందరు వచ్చి ''అయ్యా మీరు మానసమావేశంలో అరగంట మాట్లాడా''లని కోరారట. ఆయన తడుముకోకుండా పదండి అన్నాడట. ''ఉపన్యాసం తయారు చేసుకోవాల్సిన అవసరం లేదా'' అంటే అయిదు నిమిషాలు మాట్లాడమంటే ఆలోచించాలికాని అరగంట మాట్లాడడానికి ఆ శ్రమ అవసరం లేదు అన్నాడట.

మైకు రాక్షస నోరులాంటిది. ఆధనిక యుగంలో అది ఉపన్యాసాలకు ప్రతీక అయింది. కొందరికి మైకు ముందు నిలబడగానే ఆవేశం కట్టలు త్రెంచుకుంటుంది. మరికొందరికి మైకు పట్టుకోగానే ముచ్చెమటలు పోస్తాయి. మిత్రులతో గంటల తరబడి మాట్లాడిన వారు సభికుల్ని చూడగానే డీలా పడిపోతారు. అబ్రహం లింకన్‌గారు ఈ బలహీనతను అధిగమించడానికి ముందు చెట్లతో ఉపన్యసించాడట.

భాష విషయంలో కొద్దిమంది మాత్రమే జాగ్రత్తగా ఉంటారు. కొందరి ఉపన్యాసాలు విన్నపుడు వారు ఏ భాషలో మాట్లాడుతున్నారో కూడా అర్థం కాదు. ఏవో కొన్ని అత్యవసరమైన పరభాషా పదాలు వాడొచ్చు, కాని ఒక భాషకు కట్టుబడి సాగకపోతే ప్రసంగం కిచిడీలా తయారౌతుంది.

శ్రోతల స్థాయిని బట్టి వక్తభాష ఉండడం అవసరం. పండితుల సభలో పామరుల భాష వాడితే అబాసు పాలవుతుంది. వక్త విషయాన్ని అతిక్రమించి అవసరానికి మించి మాట్లాడ కూడదు. మాట్లాడాల్సిన ముఖ్యాంశాలను ముందే నిర్ణయించుకోవాలి. లేకపోతే నీళ్ళునమలవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. తమకన్నా ముందు మాట్లాడినవారు చెప్పిన విషయాలను వదిలి వేయడం మంచిది. ఇచ్చిన సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలి కాని ఊకదంపుడు ఉపన్యాసాలు చేయగూడదు. పరిమిత సమయంలో విషయం చెప్పగలిగిన వాడే మంచి వక్త.

కొందరు మాట్లాడితే కర్ణకఠోరంగా ఉంటుంది. మరికొందరి మాటలు కోయిల కంఠాన్ని మరిపిస్తాయి. కొందరు మగవారు ఆడగొంతుకతో ఆడవారు మగ గొంతుకతో మాట్లాడినట్లు అనిపిస్తుంది. స్వరంతో నిమిత్తం లేకుండా అందమైన అర్థవంతమైన భాషవాడినప్పుడు ఎదుటి వారిని మెప్పించడం కష్టమేమి కాదు.

# ఎన్నికలొస్తున్నాయి జాగ్రత్త

హమ్మయ్య ఎలక్షన్‌లొచ్చేశాయి. కుంభకర్ణుడిలా నిద్రపోతున్న ప్రతిపక్షం ఒళ్ళు విరుచుకుని లేచింది. నిరుద్యోగుల్లా వున్న పార్టీ కార్యకర్తలు అపాయింట్‌మెంట్ ఆర్డర్లు వచ్చినట్టు సంతోషపడుతున్నారు. సాంఘిక సేవకొక నమస్కారం కొట్టి స్వసేవ చూసుకోవాల్సిన తరుణం ఆసన్నమైంది. నాలుగు కంపెనీల్లో దరకాస్తుపడేస్తే ఒక్క కంపెనీలోనైనా ఉద్యోగం దొరకదా అన్న భరోసా ఉన్న పట్టభద్రునిలా నాయకరత్న ఊసరవెళ్ళేశ్వరరావుగారు గోడమీది పిల్లి పార్టీకి, మేడమీది కుక్క పార్టీకి, గుంటనక్క పక్షానికి, గుడ్లగూబ వర్గానికి దరకాస్తుపెట్టుకున్నాడు. ఏ ఒక్కరు టిక్కెట్ యిచ్చినా పర్వాలేదు. దొరకని పక్షంలో స్వపక్షం ఉండనే ఉంది. పార్టీ వారు డబ్బు పెడితేనే సరి, బ్యాంకు బ్యాలన్స్ తరిగిపోవడం సహించను అని జిల్లాకు ఎదురులేని ఏకైక నాయకుడు గట్టిగా చెప్పాడు. నీవు కాదంటే మీవాడు పోటీచేయడానికి సిద్ధంగా ఉన్నాడు, ఎవరు ఎక్కువ ఖర్చు చేయగలిగితే వారికే పార్టీ ముద్ర అని వేలం పాట పాడుతున్నాడు పార్టీ లీడర్.

మళ్ళీ మైకులు ఊదుతున్నాయి. స్వచ్ఛమైన ఊకదంపుడు ఉపన్యాసాలు వినక చాలా రోజులైంది. ఊకలో నూకలు ఏరుకుంటున్నారు పత్రికలవాళ్ళు. ''అయ్యా విలేకరులను ఎందుకు పెట్టుకుంటారండీ జీతాలు దండగ. మాలీడర్‌గారు నిన్న వారి శ్రీమతి కిచ్చిన యింటర్వ్యూ సుపుత్రుడి సమక్షంలో యిచ్చిన స్టేటుమెంట్లు రోజూ తెచ్చిస్తూనే ఉన్నాం కదా! అవి ప్రచురించండి'' అని సలహా ఇస్తున్నారు పి.ఏ టు లీడర్లు. మొత్తానికి మ్యాటర్ వెతుక్కోవాల్సిన అవసరం తీరినందుకు సంతోషం అని న్యూస్ ఎడిటర్ పళ్ళికిలించాడు.

రేడియో వింటే చాలు పత్రికలు కొనడం ఎందుకండీ అని యింతకాలం ఆలోచించిన పానకాల రావు సకాలంలో పేపరుకొని చదువుతున్నాడు. వార్తల్లో వేడి వాడి వచ్చినందుకు పాఠకులు సంతృప్తిగా ఉన్నారు.

"ప్రెస్సు మూసేద్దామనుకున్నానండీ కాని ఎలక్షన్‌లొస్తున్నాయి యిక నడుపుతాను" అని చిరునవ్వు నవ్వాడు ప్రెస్ పెద్దమనిషి. కరపత్రాల గిరాకి తగుల్తుందికదా మరి. ప్రెస్సుకు తోడు ఒక పత్రిక కూడా పెట్టండి ఎలక్షన్ల తర్వాత మూసెయ్యొచ్చు అని ఉచిత సలహా పడేశాడు కాలజ్ఞాని.

కేసులు లేక చస్తున్నామండి. తిన్న ప్రాణం కదా ఎలా ఊరుకుంటుంది చెప్పండి. దేశమంతా బుద్ధ భగవానులయితే మేమెందుకు? ఎలక్షన్లు వస్తే కాని పోటీలుండవు. పోటీలుంటేకాని వర్గాలుద్భవించవు. వర్గకలహాలుండవు. కలహాలుంటే కాని రక్షకులకు భక్షణలు లభించవు. అందుకని ఎలెక్షన్లు అవసరమేనని ఆర్గుమెంట్ చేస్తున్నాడు హెడ్డు.

పంచాయతీ రాజకీయాలు, సహకార సంఘం ఎన్నికలు, పార్లమెంటుకు పోటీలు ఎదో ఒకటి లేకపోతే గ్రామ సింహాల గతి యేం కాను. ఓట్లు పెడితేనే కదా నోట్ల ముమ్మరం పెరిగేది. ప్రజలకు పంచుతామని చెప్పి పర్సు నింపుకునేది. ప్రజల బుర్రతో ఆలోచించినా ఎలెక్షన్లు ఉండాల్సిందే. అవి ఉంటేనే కదా మమ్మల్ని చేరదీసేది. మాతో వారికి పని పడేది. అందుకని ఎలెక్షన్లు దేశంలో వర్ధిల్లాలి' అని వాక్రుచ్చాడు సామాన్యుడు.

ఎలెక్షన్లొస్తే ఊరేగింపులు తప్పవు. రోజా ఊరేగింపు తీస్తుంటే అందులో పాల్గొనే దెవరు? కిరాయి మనుషుల్తోపాటు కుర్రవాళ్ళు కూడా ఉంటారు. ఎలెక్షనంటే వారికి తెలిసిన అర్థం ఊరేగింపులు రంగు రంగుల జెండాలు, జీపుల్లో లారీల్లో నిల్చొని జై కొట్టడాలు. ప్రతిఫలంగా చాక్లెట్లు చప్పరించడం, ఆకలేస్తే పార్టీ మఠాల్లో భోంచేయడం.

అందుకే ఓ ఇల్లాలు అంటుంది. ''ఈఎలక్షన్ల కాలంలో మాపోరగాళ్ళు యిస్కూలుకు బోరు, జులాయిల్లా మోటార్ల మీద దిరిగి నోరుపాడు జేసుకుంటరు. పాణం పాడు జేసుకుంటరు. మా ఆయనైతే యేడేడ దిరిగత్తడో గాని పొద్దుకు యింటికి రాడు. జగడం బెట్టుకోటానికి మా ఆయనకు సమయం గూడా ఉండది గందుకని ఎలెక్షన్లంటే నాకు మంచి గనిపించది''.

కొసమెరుపు: మాయమాటలు మాన్యులకేకాదు సామాన్యులకు కూడా చేతనౌతాయి. ఒక నేత కార్మికుడు రాజుగారికి దేవతా వస్త్రాలు చేసిస్తానని చెప్పి ముందుగానే డబ్బు తీసికెళ్ళి ఖర్చు చేసుకున్నాడు. రాజుగారు వాన్ని పట్టి తెప్పించి సంగతేమిటన్నాడు. 'అయ్యా వస్త్రాలు తయారు చేసి తెచ్చాను యివిగో తీసుకొని ధరించండని ఉత్త చేతులు చూపాడు. రాజుగారికేమి కనబడలేదు. 'స్వామీ యివి దేవతా వస్త్రాలు, తండ్రికి పుట్టిన వారికే కనబడతాయి. మీకు కనబడడంలేదా' అన్నాడు. రాజుగారే కాదు సభలోని వారంతా కనబడుతున్నాయనే జవాబిచ్చారు.

# సినిమా సంస్కృతికి చరమ గీతం

ఏ శుభ ముహూర్తంలో లోకమాన్యుడు మహారాష్ట్రలో భారీ ఎత్తున వినాయక చవితి ఉత్సవాలు ప్రారంభించాడో కాని అవి ఇంతింతై వటుడింతై అన్నట్లు దేశమంతటా విస్తరించాయి. స్వాతంత్ర్య పోరాటకాలంలో వాటి ధాటికి తట్టుకోవడం ఆంగ్లేయులకు కూడా కష్టమయింది మరి. లోకమాన్యుడు ప్రజల్లో నున్న దైవభక్తిని స్వాతంత్ర్య పోరాటశక్తిగా తీర్చిదిద్దాడు. పదిమంది ఒకచోట గుమిగూడినా ఏదో కుట్రపన్నుతున్నారని ఆరోపించే రోజుల్లో ఆంగ్లేయపాలకులను ఎదిరించి లక్షలాది మంది గణపతి ఉత్సవాల్లో పాల్గొనడం విశేషం. వినాయకుని కార్యక్రమాల్లో ఆయనతో పాటు దేశనాయకులకు కూడా జేజేలు లభించాయి. ఆనాడు వినాయక చవితి ఉత్సవాలు కూడా దాదాపుగా స్వాతంత్ర్య పోరాటములో భాగమయ్యాయంటే అతిశయోక్తి కాదు. అది నాటి కథ.

నేడు వినాయకుని ఉత్సవాల పేరిట దేశంలో జరుగుతున్న హంగామా చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది. కొందరు సంఘ వ్యతిరేకశక్తులకు గణపతి ఉత్సవాలు మామూళ్ళు దండుకోడానికి ఉపయోగపడుతున్నాయి. కొందరు వ్యాపారస్తులు స్వార్థదృష్టితో మరికొందరు భయానికో చందాలు ఇస్తున్నారు. చోటామోటా లీడర్లంతా వీధివీధికి గల్లిగల్లికి వినాయకులను నిలిపి విద్యుద్దీపాలతో అలంకరించి, మైకులు పెట్టి వీడియోలు తెచ్చి వేస్తున్న పాటలు, చూపిస్తున్న సినిమాలు పరిశీలిస్తే మన సంస్కృతి సంప్రదాయాలు ఎలా దిగజారిపోతున్నాయో అర్థమౌతుంది. పండుగలు పబ్బాలకు మైకులే ప్రధానమయ్యాయి. ఇవి గయ్యాలి పెళ్ళాంలా అస్తమానం వాగుతూనే ఉంటాయి.

వేముల ప్రభాకర్

# నో మోర్ డైలాగ్స్ ప్లీజ్

పూర్వం అక్బర్ సంస్థానానికి ఒక బహుభాషా పండితుడు వచ్చాడట. ఆయన ఎన్నో భాషలు ధారాళంగా మాట్లాడి అందరినీ ఆశ్చర్యపరిచాడు. అతను పాదుషాతో ''అయ్యా నేను పలుభాషలు మాట్లాడగలను. అయితే అందులో నా మాతృభాష ఏదో మీ సభలో కనుక్కోగలిగిన వారున్నారా'' అని సవాలు విసిరాడు. రాజుగారాపనిని బీర్బల్‌కు అప్పగించాడు.

ఆ మరునాడు బీర్బల్, పండితుడు విడిది చేసివున్న బంగళాకు వెళ్ళాడు. పండితుడు ఉద్యానవనంలో ఒంటరిగా విహరిస్తున్నాడు. బీర్బల్ ఒక దెయ్యం వేషం వేసుకుని ఆయన ముందుకు పరుగెత్తాడు. పండితుడు గావుకేకవేస్తూ ''సైతాన్-సైతాన్'' అంటూ బంగళాలోకి పరుగెత్తాడు. ఇంకేముంది బీర్బల్ పనైపోయింది. ఆయన మరునాడు సభకు వచ్చి యిలా విన్నవించుకున్నాడు. ''కష్టాలు వచ్చినప్పుడే మనిషి నిజస్వరూపము బయట పడుతుంది. భాషలు ఎన్ని మాట్లాడగలిగినా దుఃఖంలో తల్లి భాషనే వస్తుంది. పండితుడు దెయ్యాన్ని చూసినప్పుడు సైతాన్ సైతాన్ అని అరిచాడు అదే ఆయన మాతృభాష'' అన్నాడు.

ఆనాటి ఆ పండితునికి ఈనాటి మన నాయకులకు కొన్ని పోలికలున్నాయి. ఎన్.టి.ఆర్ నాటకాలు సినిమాల పుణ్యమా అని చక్కని, చిక్కని డైలాగులు చెప్పగలరు. ఇబ్బందంతా ఎక్కడుందంటే వారు నిజ జీవితంలో కూడా అదే నాటకీయ భాష వాడుతున్నారు. తాను అలా మాట్లాడితేనే ప్రజలు ఆదరిస్తారని వారు భావిస్తున్నట్లుంది.

పండితుడు సైతాన్ ను చూసి మాతృభాషలో అరిచినట్లుగా రామారావు గారు నాదెండ్ల షాక్ ట్రీట్‌మెంట్‌తో కొంత సహజ ధోరణికి మారారు, సంతోషం.

పి.వి బహుభాషావేత్త. ఆయన దేశ ప్రధాని కావడానికి తోడ్పడిన అంశాల్లో హిందీ భాషా పరిజ్ఞానం కూడా ఒకటి. చక్కని చిక్కని తెలంగాణా తెలుగులో ఆయన మాట్లాడుతుంటే వినసొంపుగా వుంటుంది.

రక్షణ బహుళంగా ఉన్నవారు లాడ్జింగ్‌లపేర మరీ లాభప్రదమైన ఈ వ్యాపారాన్ని సాగిస్తున్నారని పత్రికలవారి గోల.

ప్రచారంలేని ఏపనైనా దండగే. చివరికి ఉద్యోగం కూడా. ప్రభుత్వం జీతమిస్తుంది కదా ఏదో కాలం గడుపుదామని అనుకునేవారు సామాన్యులు. అసామాన్యులువేరు. గుట్ట పోలీసులు ఇటీవల కొందరు వేశ్యలను పట్టుకొని వీధుల్లో ఊరేగించారట. ఇలాంటి వార్తలు మనకు మామూలే. అలా ఊరేగించడం వల్లవ్యభిచారం ఆగిపోతుందా? ఏమో ఎవరికి తెలుసు. పోలీసులకు మాత్రం మంచి ప్రచారం లభించింది. బాక్సులు కట్టి వార్తలు వేసారు. మనదేశంలో దేశ ద్రోహానికి పాల్పడ్డవార్నిగాని, స్మగ్లర్‌లనుగాని, హర్షద్‌మెహతాలను గాని మనం పట్టుకోలేము, పట్టుకున్నా శిక్షించలేము, శిక్షవిధించినా అమలు చేయలేము. కాని తినడానికి తిండి లేక ఆకలి చావులు చావలేక ఒళ్ళమ్ముకుని బ్రతికే వారిని మాత్రం కోర్టు శిక్షించకన్నాముందే మనమే శిక్షిస్తాము. మనం నేరస్థులం అయినా కూడా ఎదుటివారిపైరాళ్ళు వేస్తాం, క్రీస్తు వద్దన్నా వినం.

ఈ ఇరవయ్యవ శతాబ్దంలో కూడా ఇంకా అంటరాని తనాన్ని, ప్రోత్సహించే వారిని, అంబేద్కర్‌లాంటి మహనీయున్ని అవమానించే వారిని, సాక్షాత్తు మన రాజ్యాంగాన్ని ప్రజాస్వామ్య లౌకిక విధానాలను అవమానించే కొందరు నిరంజన్ దేవ్ తీర్థలాంటి స్వాములను మాత్రం అరెస్టు చేయలేం. కేసు పెట్టలేం. జైలుకు పంపలేం. అయితే ఈ స్వామివారికి మన రాజధాని నగరములో ప్రజలే శిక్ష విధించారు. ఒక భాలునికి నిరంజనదేవ్‌గారి వేశంవేసి మెడలో చెప్పుల హారం వేసి ఊరేగించారు. ఈపని చేసింది హరిజనులు. పాపం వారే ఎందుకు చేయాలి. మిగతా వారంతా పై స్వామివారి భక్తులనాలర్థం. ఎవ్వరు చేసినా చేయకున్నా ప్రభుత్వం ఆపని చేయాలి. దిక్కు మొక్కు లేని వేశ్యల్నుకాదు పోలీసులు ఊరేగించాల్సింది చాందసులైన నిరంజనదేవ్ తీర్థలాంటివారిని మాత్రమే.

# కొంగు జారి పోతుంది

గురువుగారూ! పదేళ్ళువయసొచ్చినా యింకా మావాడికి ముక్కు-జ్ఞానం రాలేదండి అని వాపోయాడొక తండ్రి. శాస్త్ర జ్ఞానం, లోక జ్ఞానం, కాలజ్ఞానం లాంటి ఎన్నో మాటలు విన్నాను కాని ఈముక్కు- జ్ఞానం అనే మాట మొదటిసారి విని అదేమిటయ్యా అన్నాను. కృష్ణా, గోదావరి, తుంగభద్ర వంటి నదులు ఎండినా ఎండవచ్చుకాని మా వాడి ముక్కు- మాత్రం ఎడతెరిపి లేకుండా కాగితాలపై ప్రవహించే తెలుగు గంగలాగా కారుతునే వుంటుంది సార్ అన్నాడు. నీవుపొరపాటు పడ్డావు నాయనా ఇది డాక్టరుకేసు ఏదైనా ప్రభుత్వాసుపత్రికి వెళ్తేసరి అన్నాను. ప్రైవేట్ డాక్టరు వద్దంటారా అన్నాడు. జలుబుకు మందు పుచ్చుకోవడమే ఒకదండగ. మానసిక తృప్తికి ప్రభుత్వాసుపత్రి రంగునీళ్ళు చాలు. దానికోసం ప్రైవేట్‌లో ఫీజుకూడా చెల్లించడమెందుకు అన్నాను. జలుబుకు చిన్న మందుకన్నా పెద్దమందే బాగాపని చేస్తుందని వినికిడి, మీరేమంటారు అన్నాడు. అది నాకేం బోధపడలేదు. ఆయనే అన్నాడు మళ్ళీ. చిన్నమందంటే డాక్టర్లు వద్దనేది సార్ అని. నేనన్నాను ''నాయనా రోగం వచ్చి నాక త్రాగేది చిన్నమందు, రోగం రావడానికి త్రాగేది పెద్ద మందు. మీ వాడికి రెండు మందులూ అవసరంలేదు. ఒకతుండుగుడ్డ కొనివ్వు సరిపోతుంది'' అని.

ముక్కు-జ్ఞానం ఆలోచనలు కొంగుజ్ఞానం మీదికి వెళ్ళాయి. కొందరు ఆడపిల్లలకు కొంగుమీద ధ్యాసే ఉండదు. ముఖ్యంగా అప్పుడే యవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టిన అమ్మాయిలు కొత్త మురిపానికి కొంగు వేస్తూనే వుంటారు, అది జారుతూనే ఉంటుంది. ''కాలు నిలువదు-నిలువదు జారు పైట'' అన్నాడొకకవి. ఈ రోజుల్లో పైటలు కూడా అలాగే వచ్చాయి. ఎన్నిసార్లు వేసినా అన్నిసార్లు జారుతూనే ఉంటాయి. పూర్వం పైటలు అలాంటివి కావు. పాపం అవి పైరగాలి వస్తేగాని జారేవి కావు. ''సిగ్గుతలేని చిన్నది-గయిండ్ల నిలబడి గడిగడికి కొంగేస్తది'' అన్నాడో జానపదకవి. ఇలా గడి గడికి కొంగు జారడమెందుకు, దాన్ని వేయడమెందుకు, కొంటె

కుర్రవాళ్ళకు కనువిందు చేయడమెందుకని కాబోలు ఆధునికులు కొంగుల్ని పిన్నులతో బంధిస్తున్నారు. మరికొందరు యింకా ముందుకు వెళ్ళి చీరలకే గుడ్ బై చెప్పేసి కొంగులను కాలగర్భంలో కలిపేస్తున్నారు. ఏదేమైనా కొంగు మటుమాయమై పోవడం విచారకరమైన విషయం. ఆడపిల్లల చేతులకు -కొంటెకుర్రవాళ్ళ కళ్ళకు ఎక్సర్‌సైజ్ లేకుండా పోతుంది. కవుల సంగతి సరేసరి శృంగార కవిత్వమంతా కొంగు పట్టుకు తిరిగిందేకదా!

సిటీ బస్సులో ప్రయాణం చేసే వారందరికీ సీటు విలువ అంటే తెలిసే ఉంటుంది. కూర్చోడానికి సీట్లు దొరకక గంటల తరబడి నిలబడలేక బస్సు ఊచలు పట్టుకుని ఆరేసిన బట్టల్లా వ్రేలాడుతూ ప్రయాణం చేసే వారికి ప్రక్క వారెవరైనా సీటు ఖాళీ చేస్తే ఎం.ఎల్.ఎ. టికెట్ లభించినట్లు పరుగున వెళ్ళి కూర్చుంటారు. మరికొందరికి సీటు జ్ఞానమే ఉండదు. అలాగే నిలబడి ఇంట్లో పెళ్ళాం గురించో, ఆఫీసు బాసు గురించో ఆలోచిస్తునే ఉంటారు. తమ ప్రక్కనే సీటు ఖాలైనా చూసుకోరు. అటుయిటు ఉన్నవారు త్రోసుకుని వచ్చి కూర్చున్నాక వీరికి జ్ఞానోదయం కలుగుతుంది.

కొసమెరుపు: సీటు జ్ఞానం రాజకీయ వేత్తలకు కూడా ముఖ్యం. ఢిల్లీవరకు వెళ్ళి పైరవీలు చేసి అధికారపార్టీ టిక్కెటు తెచ్చుకునే హడావిడే ఎక్కువ. తీరా టిక్కెట్ వచ్చి నామినేషన్ వేయాలనుకునే సరికి ఓటరులిస్టులో పేరుండదు.

# చీరోపాఖ్యానం

రచయిత చలంగారి భార్యకు అందరి ఆడవాళ్ళకు మల్లే చీరెల మోజుండేది. బంధువులు మిత్రులు వచ్చినప్పుడు అవి ప్రదర్శించి ఆమె మురిసిపోయేది. కాని చలంగారికి అది నచ్చలేదు. ఒకరోజు ఇంట్లో బంధుమిత్ర సపరివారమంతా ప్రోగైన సుముహూర్తాన చలంగారి అర్ధాంగి తన సమయాన్నంతా గంటకో చీర మార్చడంతో సరిపెడుతుంది. ఆవిడ అవస్థను చూసిన చలం ఇంట్లోకి వెళ్ళి భార్య చీరెలన్నీ ఒక అడ్డకట్టెకు తగిలించి తీసుకొచ్చి అందరికీ చూయిస్తూ ''ఈ రోజు మీరు చూచిన మూడు చీరెలేకాక మా ఆవిడకు యిన్ని చీరెలున్నాయి. ఒకే రోజులో యివన్నీ కట్టుకుని చూయించాలంటే కష్టం కనుక ఈ పని చేశాను'' అన్నాడట. ఆ సమయంలో ఆయన భార్య పడ్డ అవస్థ వర్ణనాతీతం. మూడు రోజులదాకా అన్నం మానేసి ఆవిడ ముసుగుపెట్టిందట పాపం.

స్త్రీకి చీరెలు రెండో ప్రాణం. ఎన్ని చీరెలు ఎక్కువగా ఉంటే అంత గొప్పతనం ఫీలవుతారు. క్రొత్తగా పెళ్ళయిన అమ్మాయికి కనీసం మూడు పదుల చీరలైనా లేకపోతే అది పెళ్ళేకాదు. యే పండుగొచ్చినా పబ్బమొచ్చినా చీర కొనిపెట్టమనడం సహజం. పదివేలు పోసి పెండ్లిలో కొన్న పట్టుచీర జీవితంలో పదిసార్లు కూడా కట్టుకోకముందే చివికి పోతుంది. కొత్తదనం చీరలోనే లేదు. అవి ధరించడంలో కూడా ఉంది. కొత్తగా రిలీజైన ఓ సినిమాలో సినీ సుందరి క్రొత్తపద్ధతిలో చీర ధరించింది. అలాగే చీర కట్టుకోవాలని కోరిక కలిగి వరుసగా ఆ సినిమాను పదిసార్లు చూసి పదకొండోసారి హీరోయిన్‌లా స్నేహితురాలు పెళ్ళికి ఆస్టయిల్లో చీరె కట్టుకుని వెళ్ళిందట. ఎక్కడ పొరపాటు జరిగిందో ఏమో అందరూ చూస్తుండగా పాపం అమ్మాయి చీర ఊడిపోయింది.

ఇటీవల పత్రికలో చిన్నకథ చదివాను. ఒక గృహిణికి దుకాణదారు ఒక కొత్త చీరె చూయించి ''రేపు రిలీజుకాబోయే సినిమాలో హీరోయిన్ యిదే చీర ధరించిందండీ'' అని చెబుతాడు. ఆ యిల్లాలు చీర కొనుక్కుని మరునాడు అదే చీర ధరించి సినిమాకు వెళుతుంది. సినిమాలో హీరోయిన్ ఆ చీర కట్టుకుని కనిపిస్తుంది. కాని వచ్చిన చిక్కేమిటంటే ఆ చీర ఒక రేప్ సీన్లో ఉంటుంది. సినిమాకు వెళ్ళిన గృహిణికి ఆసీను చూసేసరికి ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు ప్రాకినట్లయి వెంటనే సినిమా నుండి బయటకు వచ్చేస్తుంది.

కొసమెరుపు: ద్రౌపదీ వస్త్రాపహరణం సీన్ కురుక్షేత్రంలో బాగుందని ఒకరంటే లేదు కర్ణలోనే బాగుందని యింకొకరన్నారు. ఎవడు తీసినా వస్త్రాపహరణం బాగానే ఉంటుంది అన్నాడొక మధ్యవర్తి.

# కొంచెపు బుద్ధులు

విలాసవంతమైన జీవితంపై విలువైనవస్తువులపై ప్రజా నాయకునికి మోజు ఉండకూడదు. ఆ కోరికల్ని చంపుకోలేనివాడు ప్రజా సేవలో రాణించ లేడు. ప్రజాసేవకు ప్రతిఫలం ప్రజా సంక్షేమమే, నాయకునికి లభించేది ఆత్మ సంతృప్తి.

దక్షిణాఫ్రికాలోని భారతీయ సంతతి ప్రజలకు మహాత్మాగాంధి చేసిన సేవలు అపూర్వమైనవి, అనితర సాధ్యమైనవి. ఆయన వారి కష్టాల్లో పాలుపంచు కొని ప్రేమాభిమానాలు చూరగొన్నాడు. దక్షిణాఫ్రికా వదలి భారతదేశం రావడానికి సిద్ధమైనప్పుడు అక్కడ భారతీయ సంతతి ప్రజలు మహాత్మునికి ఎన్నో విలువైన కానుకలు సమర్పించుకొన్నారు. అందులో వెండి, బంగారు నగలు, వజ్రాలు కూడా ఉన్నాయి. అవన్నీ చూశాక ఆయనకు దిక్కుతోచ లేదు. రాత్రి నిద్రకూడా పోలేకపోయాడు. ప్రజాసేవకు గుర్తింపుగా, ప్రజలు సమర్పించుకున్న కానుకలు ప్రజలకే చెందాలని ఆయన నిశ్చయించుకొని వాటితో ఒక ట్రస్టు ఏర్పాటుచేశాడు. కస్తూరిబా నగల విషయం లో ప్రలోభ పడ్డా ఆయన ఒప్పుకోలేదు. ఇది నాటి విషయం. ఇకనేటి విషయం ఒక కులసంఘంవారు ఎంతో మోజుపడి ''ఒకానొక ముఖ్యమంత్రి గారిని సంఘ సమావేశానికి ఆహ్వానించి శుద్ధమైన వెండి కలశాన్ని వారికి భక్తిశ్రద్ధలతో సమర్పించారట. వారుకూడ అంతే భక్తితో దాన్ని స్వీకరించి ఇంటికి తెచ్చుకు న్నారని ఆరోపణ. వెంటనే ఆ కులపెద్ద ఒక ప్రకటన చేస్తూ అన్నగారు తీసుకెళ్ళడమేమిటి వారికి మేమే ప్రేమతో ఇచ్చాం అన్నారు. ప్రభుత్వ హోదాలో నున్న వ్యక్తి, ఆహోదాను గౌరవించి ప్రజలిచ్చిన కానుకల్ని తన స్వంతానికి వాడుకోవడం న్యాయం కాదు. ఇలాంటి సంఘటనే గతంలో కరీంనగర్ జిల్లాకు చెందిన ఒక శిల్పికి జరిగింది. అన్నగారికి తన శిల్పచాతు ర్యాన్ని చూయించాలని ఆ మహాశయుడు గుళ్ళో ప్రతిష్టించిన విగ్రహాన్నే

తెచ్చాడు. కళా హృదయుడైన అన్న ''ఓహో బాగుందని'' ఆ విగ్రహం తెచ్చుకోవడం, ఆ విగ్రహాన్ని కొనుక్కున్న గ్రామస్తులు గొడవ చేయడం చివరికి విగ్రహం స్వంతదారులకు వాపసుచేయడం జరుగుతుందని ప్రకటించ డం వరకు వ్యవహారం సాగింది.

అధికారంలో మున్నవారు తీసుకోవాలిగాని కానుకలు సమర్పించుకోడానికి భక్తులు కోకొల్లలు. డబ్బు రూపకంగా యిస్తే లంచం అవుతుంది. మెమెం టోగా యిస్తే తప్పుకాదు అన్నది, ఇలాంటి భక్తుల నమ్మకం. ఎంత విలువైన మొమెంటోయిస్తే, అంతగా**మూర్తి**గారిని సంతోషపెట్టినట్లవుతుందని గ్రహిం చిన కొందరు ప్రభుత్వాధికార్లు అత్తసొమ్ము అల్లుడుదానం చేసినట్లు ప్రజల సొమ్ముతో మొమెంటోలు తయారుచేసి, సమర్పించుకొని వారి అనుగ్రహం పొందడానికి ప్రయత్నించడం మామూలే. ఇలాంటి విలువైన మొమెంటోల ఖర్చు ఏ లెక్కలో రాస్తారో ఎవరు భరిస్తారో వారికే తెలియాలి. అయినా పదవి హోదా కాపాడడానికైనా నాయకులు ఈ కొంచెపు బుద్ధులు మానుకోవాలి.

పూలమాలలుకూడ స్వీకరించనని ప్రకటించిన నాయకులు నిలువెత్తు పూలమాలలకు తలలువంచుతున్నారు. వేయగలిగినవారు, వేస్తున్నవారు కూడా పైరవీకార్లే. వీళ్ళకు పదవిలో ఉన్నవారు కావాలి అంతే తప్ప అది గాడిదైనాసరే మాలవేయడానికి వెనకాడరు. పదవిలో వున్న రాజకీయ నాయ కులు, ఉన్నతాధికార్లు విలువైన కానుకలు స్వీకరించరాదని, స్వీకరించినా అవి ప్రభుత్వానికే చెందుతాయని చట్టాలు చేసినా ప్రయోజనం లేదు. నాయకుల్లో నైతిక విలువలు లేనప్పుడు ఇవన్నీ బూడిదలో పోసిన పన్నీరు తప్ప వేరుకాదు.

మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు తనకు రాష్ట్రపతి హోదాలో లభించిన కానుకలన్నింటితో అనంతపురంలో తన ఇంట్లో ఒక ప్రదర్శనశాల పెట్టాడట. గ్రుడ్డికన్నా మెల్లమేలు.

కొసమెరుపు: ''మమ్మీ నాబర్త్‌డేకి అంకుల్ ప్రెజంటేషనేదీ తీసుకురాలేదు స్వీటు యివ్వమంటావా వద్దా'' అని అమాయకంగా అడిగాడట ఓ కుర్రవాడు వాళ్ళమ్మను.

# మలయాళ మార్గం

ప్రముఖ కవి రచయిత ఆరుద్రగారు ఆస్పత్రిలో చేరితే చికిత్స ఖర్చుల కోసం ప్రభుత్వాన్ని అర్థించారట. ఇదీ మన దౌర్భాగ్యం. తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవచేసిన మేటి రచయిత. ఆర్థిక పరిస్థితే యిలా ఉంటే ఒక సామాన్య రచయిత/జర్నలిస్టు సంగతి వేరే చెప్పాలా. ఎందరో రచయితలు ఎంతో కష్టపడి రచించిన పుస్తకాలు కూడా ప్రచురణ భాగ్యానికి నోచుకోకపోవ డానికి కూడా ఆర్థిక పరిస్థితే కారణమవుతుంది. ఈ పరిస్థితి నుండి కొంత వరకైనా బయటపడగలిగినవారు మలయాళ రచయితలు. నాలుగు దశాబ్దాల నాటి విషయం. కేరళలోని అభ్యుదయ రచయితలు కొట్టాయములో ఒక సమావేశము ఏర్పాటు చేశారు. మలయాళ భాషా సంబంధితమయిన చాలా అంశాల మీద మూడు రోజులు సుదీర్ఘమైన చర్చలు ఉపన్యాసాలు జరిగాయి. మరునాడు రచయితలంతా తమ స్వస్థలాలకు తిరిగి వెళ్ళిపోవాలి. చాలా మంది దగ్గర బస్సు ఖర్చులు కూడా లేవు. తమ దీనావస్థకు నవ్వాలో ఏడ్వాలో రచయితలకు తోచలేదు. ఈమేధావి వర్గానికి సహాయంగా యేధనిక వర్గం కూడా అప్పుడు ముందుకు రాలేదు. ఈసారి తమ ఆర్థిక దుస్థితిని చర్చించడా నికి రచయితలు పూనుకున్నారు.

రచయిత తన పరిజ్ఞానాన్నంతా వినియోగించి పుస్తకాలు రాస్తున్నాడు. వాటిని ప్రచురించి అమ్ముకునే అంతటి ఆర్థిక బలం ఆయనకు లేదు. ప్రచురణకర్తలను ఆశ్రయిస్తే నామమాత్రంగా చెల్లించి లాభాలు గడిస్తున్నారు. చివరకు రచయితలకు యేమీ మిగలడం లేదు. రచయితలంతా కలిసి ఒక సమిష్టి నిధి యేర్పాటు చేసుకుంటే ఈ విషయములో ముందడుగు వేయ వచ్చు. తమ పుస్తకాలను తామే ప్రచురిస్తే లాభాలు బయటివారికి పోవు.

మిగులు సొమ్ముతో మరో రచయితను వెలుగులోనికి తేవచ్చు. ఈ ఉద్దేశ్యం నెరవేరడానికి వారు ''రచయితల సహకార సంఘం'' ఏర్పాటు చేయ నిశ్చయించారు. రచయితల చేత, రచయితలకోసం కృషి చేసే ఒక సంఘం ఆనాడు ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా ఏర్పాటైంది. అది మూడు పూలు ఆరుకాయలుగా వర్థిల్లి ఈనాడు మలయాళ పుస్తక ప్రపంచంలో ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

వీరు రోజుకు ఒక పుస్తకం చొప్పున ప్రచురిస్తున్నారు. స్వంత ప్రెస్సు ఏర్పాటు చేసుకున్నారు. రాష్ట్రమంతటా పుస్తక విక్రయ శాలలను తెరిచారు. మలయాళ రచయితల్లో 90% మంది ఈసొసైటీలో సభ్యులు.

మలయాళ భాషకు ఈసంఘం చేసిన సేవ శ్లాఘనీయమైనది. యితర భాషల్లోని మంచి పుస్తకాలను తమ భాషలోకి తమ పుస్తకాలను మలయాళేతర భాషల్లోకి అనువదించి ప్రకటించడం. భాషాకోశాలు, చరిత్ర గ్రంథాలు, సాహిత్య చరిత్రలను ముద్రించి తక్కువ ధరలో ప్రజలకు సరఫరా చేయడం, రామాయణ, భారతాది పౌరాణిక గ్రంథాలను ప్రకటించడం వీరి కార్యకలాపాల్లో కొన్ని. మలయాళ భాష ఎన్సైక్లో పీడియాను వీరు 10 సంపుటాలుగా ప్రచురించి వెలువరించారు. తమ కార్య కలాపాలను తెలియజేయడానికి ఈసొసైటీ ఒక మాస పత్రికను కూడా ప్రచురిస్తుంది. ప్రతి సంవత్సరం ఏప్రిల్ మాసంలో ఈ పత్రిక విశేష సంచికగా వెలువడుతుంది. ఆ సంవత్సరములో వీరు ప్రచురించిన పుస్తకాల జాబితాను యిందులో చేర్చుతారు. మలయాళంలో అత్యధిక ప్రచారాన్ని పొందిన పత్రికల్లో యిది ఒకటి.

యిలాంటి సొసైటీలను అన్ని భాషల రచయితలు ఏర్పాటు చేసుకున్ననాడు పుస్తక ప్రచురణ రంగంలో గొప్ప విప్లవము రాగలదు. అంతేకాక మంచి పుస్తకాలు అందరికి అందుబాటులో ఉండే ధరలకు అందగలవు.

కొసమెరుపు: తెలుగు సాహిత్య ప్రియులకు శ్రీరాంభట్ల కృష్ణమూర్తిగారు సుపరిచితులు. వారి రచనలు ప్రచురించని తెలుగు పత్రికలు లేవంటే అతిశయోక్తికాదు. వీరు నలభై ఏళ్ళ క్రితం ఒక పుస్తకం ప్రచురించారట. ఇంతకాలానికి మళ్ళీ ''పారుటాకులు'' పేరుతో మరో పుస్తకం విశాలాంధ్ర వారి పుణ్యమా అని వెలువడింది. ఈ దౌర్భాగ్యానికి కారణం రచనలు లేకకాదు, ప్రచురించలేని నిర్భాగ్యత మాత్రమే.

# ప్రేమా పిచ్చి రెండూ ఒకటే

విత్తుముందా చెట్టుముందా అని అడిగితే ఎవరైనా ఏం చెబుతారు రెండూ రెండే. చెట్టులేందే విత్తుగాని, విత్తులేందే చెట్టుగాని లేవు. ఇలాంటి విషయాలపై చెట్లక్రింద కూర్చుని గంటల తరబడి హస్కు కొట్టవచ్చు. ఇలాంటిదే మరో విషయం తీసుకొని సాక్షాత్తు బావ మరది కాలజ్ఞాని వద్దకు వచ్చాడు. యూనివర్సిటీ క్యాంపస్‌లో సీతాకోక చిలకల్లాంటి అమ్మాయిల్ని చూసిన కళ్ళతో పాఠ్యపుస్తకాల్లోని అక్షరాలను చూడలేక పోతున్నాను అర్జంటుగా పెళ్ళి చేసుకోవాలి అన్నది ఆయన వినతి. ఔను పెళ్ళీడు వచ్చాక ఇంకా ఆగడం దేనికి అన్నది నా ప్రశ్న. ఏ ఉద్యోగం లేకుండానే మూడుముళ్ళు వేసేస్తే అమ్మాయిని పోషించడం ఎలా అన్నది ధర్మసందేహం. పెళ్ళిముందా ఉద్యోగం ముందా అన్న చర్చలో పడి మేము మూడు గంటల కాలంలో ఆరుకప్పులటీ త్రాగినా ఫలితం కనబడలేదు.

పెళ్ళయితేగాని పిచ్చికుదరదు పిచ్చికుదిరితేగాని ఎవరూ పిల్లనివ్వరు. ఇవ్వకపోవడమేమిటీ మేమిస్తాము అన్నాడొకాయన. ఆయన వాదమేమిటంటే చదువుకున్న ఒడ్డూ పొడుగు ఉన్న కుర్రవాడికి ఏదో ఒక ఉద్యోగం దొరకక పోదు. ఉద్యోగంలేనపుడు అమ్మాయినిస్తే ఎంత కట్నమిచ్చినా ఒప్పుకుంటారు. అదే మామూలు గుమస్తా గిరిచేసే కుర్రవాడైనా లక్షల్లో బేరమాడేస్తున్నాడు. అందుకని నిరుద్యోగులకు అమ్మాయినివ్వడమే భలే మంచి చౌకబేరము అన్నాడతను. మా బావమరది ఏమంటాడంటే ఉద్యోగం కొరకు ప్రయత్నం చేయడంలో తప్పులేదు రెండిట్లో ఏది ముందొచ్చినా ఒప్పేసుకోవాలి. పెళ్ళామే ముందు దొరికితే అత్త వారి తరపునన్నా ఉద్యోగప్రయత్నం జరుగుతుందికదా అంటాడు. అదీ నిజమే పెళ్ళయినా ఉద్యోగమైనా వయసులో ఉన్నప్పుడే చేసేసుకోవాలి. ఏజ్ బారయినాక ప్రయత్నించి లాభంలేదు. అందులోనూ కవులు యవ్వనం క్రొవ్వత్తిలా చకచకా కరిగిపోతుందన్నారు. కాబట్టి శుభస్య శీఘ్రం అన్నాను. ఉద్యోగం దొరకడం కష్టం. ఇక మిగిలిందేమిటి పెళ్ళి, చేసేసుకుంటానన్నాడు. 'అన్నమైతేనేమిరా మరి సున్నమైతేనేమిరా అందుకే ఈ పాడు పొట్టకు అన్నమే వేతమురా' అన్నట్టుంది ఆయన నిర్ణయం.

కొసమెరుపు: ఆ కుర్రవాడుంటున్న వీధిలోని అందమైన అమ్మాయిలంతా ఒకరితర్వాత ఒకరు పెళ్ళిళ్ళు చేసుకుని వెళ్లిపోతూంటే అమాయకంగా వాళ్ళమ్మ దగ్గరికెళ్ళి ''మమ్మీ నేను పెద్ద వాన్నయ్యేసరికి ఒక్క అమ్మాయి కూడా మిగిలేట్టులేదేనాకు వెంటనే పెళ్ళిచేయండి'' అన్నాడట.

# తులాభారంలోని మాయాజాలం

ఇటీవల ఒక విచిత్రమైన దొంగతనం జరిగింది. ముగ్గురు వ్యక్తులు వచ్చి ఒక యిల్లాలును కత్తి చూపి బెదిరించి ఆమె నగలు దోచుకున్నారు. అంతేకాదు అదే కత్తితో ఆమె ముక్కు చెవులు కోసి పారిపోయారు. నగలు ఎత్తుకు పోయారంటే మామూలే కాని ముక్కు చెవులు కోయడం దేనికి? ఈ విషయంపై ఒక దినపత్రికలో కార్టూను వేశారు. నగలు ధరించిన స్త్రీల ముక్కు చెవులు కోసుకుపోతున్నారు కనుకనే బంగారు నగలు చేయించడం లేదని భార్యకు హితవు చెపుతున్నాడు భర్త. బొమ్మలో భార్య అమాయకురాలు కాబట్టి నమ్మినట్టు మొగం పెట్టింది. కాని నిజ జీవితంలో భార్యామణులు అంత తేలిగ్గా నమ్మక పోగా 'నగలు చేయించలేనని చెప్పలేక వాడు ముక్కు కోసుకు పోయాడు, వేలు కోసుకు పోయాడని కల్పించి కథలు చెబుతున్నా' రని చివాట్లు పెడతారు.

మన స్త్రీలకు భర్తకన్నా కూడా బంగారమే ఎక్కువ ప్రియమైనదంటే పతివ్రతలు మండి పడవచ్చు కాని గట్టిగా ఖండించలేరు. అవసరమొచ్చి మార్కెట్లో అమ్మకానికి పెడితే బంగారం అమ్ముడు పోతుంది కాని భర్త అమ్ముడుపోడుకదా! పైగా భర్తను అమ్ముకుంటుంది అపర సత్యభామ అని తూాలనాడుతారు కూడా. సత్యభామ నారదులుగారి మోసపు మాటలు నమ్మి శ్రీకృష్ణునిపై తనకున్న హక్కులన్నీ (కాళ్లు పట్టించుకునే హక్కు కూడా) వదులుకుంది. ఆ తరువాత తన దగ్గరున్న నగా నట్రా సర్వము సమర్పించు కున్నా భర్తను సాధించుకోలేక పోయింది. చివరికి సవతి రుక్మిణిని ఆశ్రయించక తప్పింది కాదు. సత్యభామ గర్వాన్ని అణచడానికి ఇదంతా శ్రీకృష్ణుడాడిన నాటకమే నంటారు. అది ద్వాపర యుగం సంగతి. ఈ కలి యుగంలో అపర సత్యభామల గర్వం అణచడానికి ఒక్క కృష్ణారావు కూడా సాహసించడం

లేదు. కృష్ణపరమాత్మన్నీ కూరగాయల్లా త్రాసులోవేసి అమ్మడం పుక్కిటి కథ అంటున్నారు. కాకపోతే క్వింటాలు బరువుకు తక్కువకాని కృష్ణుడు మిల్లీగ్రాము బరువులేని తులసి పత్రానికి తూగడమేమిటి? పాపం సత్యభామ అమ్మగారి నగలు, అత్తగారి నగలు అన్నీ కలిపి వేసినా కృష్ణున్ని తూచలేక పోవడమేమిటి? అని రంగనాయకమ్మలా ఖండిస్తున్నారు. అంతేకాదు శ్రీకృష్ణ తులాభారానికి వాడిన త్రాసు 'తూనికలు ప్రమాణాల శాఖ' వారిచే సర్టిఫై చేయించింది కాదు. అందులో మోసం ఉండి ఉంటుందంటున్నారు. నిజమే మరి ఆ కాలంలో కూడా ఈనాటి దుకాణదార్లకు మల్లే మోసపు త్రాసులు వాడి ఉంటారు. సత్యభామకు ఆ అయిడియా వచ్చి వుంటే వెంటనే వేట్స్ అండ్ మేజర్స్ డిపార్టుమెంటు వారికి ఫోనుచేసి తులాభారం లోని మాయాజాలం కనిపెట్టి ఉండేది, నారదుల వార్ని వెంటనే అరెస్ట్ చేయించి బందీఖానాలో కుక్కించేది.

యింతకూ చెప్పొచ్చేదేమిటంటే భర్తను కాపాడుకోడానికి తన బంగారాన్నంతా సత్యభామలా త్యాగం చేయడానికి మన స్త్రీలు ససేమిరా ఒప్పుకోరు. అయినా మన స్త్రీలకు ముఖ్యంగా గ్రామీణ స్త్రీలకు బంగారం మోజు తగ్గడం లేదు. ముక్కు చెవులు కోసే అసాధ్యులైన దొంగలెందరు వచ్చినా మాకు భయం లేదని నఖశిఖ పర్యంతం నగలు అలంకరించుకుని తిరుగుతున్నారు. బంగారం కొనే తాహతు లేకపొతే గిల్టునగలైనా సరే పెట్టుకుంటున్నారు. స్త్రీలే కాదు పురుషులకు కూడా ఈమధ్య బంగారంపై మోజు పెరిగినట్టుంది. హారాలు చేయించుకుని మెడలో వేసుకుంటున్నారు, ఉంగరాలు పెట్టుకుంటున్నారు.

కొసమెరుపు: భారతదేశాన్ని బంగారు పిట్ట అని మన స్త్రీలను చూసే అని ఉంటారు.

# రాజకీయ సన్యాసులు

''సన్యాసి'' అన్న పదానికి నిఘంటువు మూడు అర్థాలు చెబుతుంది. సొమ్ము వదిలంగా ఉంచువాడు, ప్రాపంచిక సంబంధమును పూర్తిగా పరిత్యజించి ఐహిక సుఖములకు దూరమైనవాడు, త్యక్తాహారుడు అనగా తిండి మానినవాడు అని. వీటిని బట్టి చూస్తే సన్యాసి రూపానికే మనిషికాని మిగతా విషయాల్లో మానవాతీతుడే. ఒక మామూలు మనిషి జీవితముపై విరక్తి చెంది సన్యాసం పుచ్చుకోవాలంటే దానికి చాలా పెద్ద తంతు జరపాల్సి ఉంటుంది. కేవలం బ్రాహ్మణుడే సన్యాసం పుచ్చుకోడానికి అర్హుడనే మహానుభావులు చాలా మంది ఉన్నారు. ఒక హరిజనుడో మరో వెనుకబడిన తరగతికి చెందిన వాడో సన్యాసం పుచ్చుకుంటానంటే దీక్ష యిచ్చే మరో సన్యాసి దొరకడం కష్టమే మరి.

ఇన్ని ప్రతికూల పరిస్థితుల్లో కూడా సన్యాసం పుచ్చుకొని సన్యాసులకే మార్గదర్శకుడైన వాడు స్వామి వివేకానంద. ఇప్పుడు కొత్తగా చలామణిలోకి వచ్చిన వారు రాజకీయ సన్యాసులు. వీరు అన్ని రాజకీయ పార్టీల్లోనూ ఉన్నారు. సంజయ్‌గాంధీ కాలంలో తుపాకుల సన్యాసిగా పేరుగాంచిన ధీరేంద్ర బ్రహ్మచారి కూడా సన్యాసేకదా! జనతాపార్టీలో స్వామి అగ్నివేశ్ గారు మొదలుకుని తెలుగుదేశంలో శ్రీ ఎన్.టి రామారావుగారిదాకా అంతా సన్యాసులే. అయితే ఈ సన్యాసులకు ప్రాపంచిక సంబంధాలే ముఖ్యం. వ్యక్తిగత ద్వేషాలకు వీరు అతీతులు కారు. మరి రాజకీయాల్లో ఉన్నప్పుడు వెన్నుపోట్లు, కుట్రలు, కుతంత్రాలు తప్పవుకదా! సన్యాసి గత జీవితానికి ప్రస్తుత జీవితానికి ఎలాంటి సంబంధం ఉండకూడదు. భార్యా పిల్లలు బంధువులు ఆస్తిపాస్తులు, ప్రేమానురాగాలు వదలుకొని వచ్చినవాడే నిజమైన సన్యాసి. అందుకే సన్యాసం స్వీకరించడానికి ముందు ఆవ్యక్తి తన గుడ్డల్ని కూడా వదలిపెడతాడు. అంతేకాదు దహన సంస్కారాలు కూడా జరుపుతారట. అంటే సన్యాసానికి పూర్వమున్న మనిషి పూర్తిగా చనిపోయి సన్యాసం తర్వాత కొత్త జన్మ ఎత్తాడన్నమాట. ఆయనకు పూర్వజన్మవాసన ఏమాత్రం లేదన్న మాట. కాని రాజకీయ సన్యాసులమాట వేరు. సన్యాసం సంసారం రెండూ ఒకేసారి చేయగల నేర్పరులు వీరు.

# ఉత్తరాలదేవుళ్ళు-గొర్రెదాటు మనుష్యులు

''దేవుడిని విశ్వసించండి. వేంకటేశ్వర స్వామి మిమ్మల్ని కరుణిస్తాడు. మీకు అదృష్టాన్ని ప్రసాదిస్తాడు. ఈ ఉత్తరము స్వయంగా దేవుడే వ్రాసి పంపాడు. దీనికి 20 కాపీలు చేసి మీ మిత్రులకు పంపండి. ఇది చదివిన 96 గంటల్లోగా జవాబులు రాయకపోతే మీరు తప్పీమని చచ్చిపోతారు. మీ ఉద్యోగం పోతుంది. భార్యాబిడ్డలు తప్పిపోతారు. ఒకవేళ వ్రాసి పంపారా మిమ్మల్ని లాటరీ వరిస్తుంది''. వంటి ఉత్తరాలు ఎన్నో ఎందరెందరికో వస్తుంటాయి. చదివిన వారు బెదిరి పోతుంటారు. వ్రాయక పోతే యేవిపత్తు వస్తుందో అన్నది వారి భయం. ఇలాంటి ఉత్తరాలు ప్రజల్లో మూఢ భక్తిని పెంపొందించడానికి ఉద్దేశించబడినవి. మత ప్రచారకులు కనిపెట్టిన ఒక ప్రచార సాధనం ఈ ఉత్తరాలు. దేవుని యెడ భక్తి విశ్వాసాలు ఉన్నా లేకున్నా భయం చాలామందిలో ఉంటుంది. ఈ బలహీనతను ఆధారంగా తీసుకుని వారిచే దేవుని ప్రచారం చేయించడమే ఈ ఉత్తరాల ఎత్తుగడ.

యెవరో మూఢభక్తులు మరికొందరు మూఢులను తయారు చేయడానికి దేవుని పేర ఈ ఉత్తరాలు ప్రారంభించారన్న విషయం స్పష్టం. ఈ ఉత్తరాలను నమ్మి మనం 20 కాపీలు చేశామంటే మూఢుల పేరిస్తులో చేరిపోయినట్టే.

ఈ దేవుడి ఉత్తరాలు (20) కాపీలు టైపు చేయించి పంపడానికి కనీసం టైపింగు ఖర్చులు పోస్టేజి కలుపుకుని యాభైరూపాయలన్నా అవుతాయి. మనఖర్చుకు, శ్రమకు మిగిలే ఫలితం మనలాగే మరో (20) మందితో ఖర్చు చేయించడం. ఇలా మూఢ విశ్వాసాలపై రోజుకు మన దేశంలో ఎంత సొమ్ము ఖర్చు అవుతుందో.

కొసమెరుపు: ఒక ప్రవాహం ఒడ్డున కొన్ని గొర్రెలు మేస్తున్నాయి. అందులో నుండి ఒక గొర్రె ప్రమాదవశాత్తు జారి ప్రవాహంలో పడింది. ఆ విషయం గుర్తెరుగక మిగతా గొర్రెలు కూడా ప్రవాహంలో దూకేశాయట. మొదటి గొర్రెతో పాటు ఇవి కూడా కొట్టుకు పోయాయట. ఈ గొర్రెదాటు, మనుషుల్లో కూడా ఉండబట్టే దేవుని ఉత్తరాలు ఈ 20వ శతాబ్దంలో కూడా ఛలామణి అవుతున్నాయి.

# నలుపు

వేముల ప్రభాకర్

''పెళ్ళయేవరకు మానాన్న, పెళ్ళయినాక మీనాన్న నా నోరు మూయిస్తూనే వచ్చారు. ఇపుడు నువ్వు కూడా నన్ను నోరు మూసుకోమనే అంటున్నావు. మరి నేను నోరు తెరిచేదెపుడు కాటికి పోయిన్నాడా?'' అని ఒక అమ్మ ఆవేదనతో అంటుంటే ఆకొడుకు నోరెత్తలేకపోయాడు.

నిజమే ఆ తల్లి కేవలం స్త్రీ అయిన కర్మానికి జీవితాంతం పురుషాధిక్యతకు తలవంచి బ్రతికింది. చివరికి కన్నకొడుకు కూడా ఆమె అభిప్రాయాలకు విలువనివ్వక పోతే ఎలా? ఏనోరునైనా ఎవరైనా ఎంత కాలం మూయించగలరు? అలుగుటయే ఎరుంగని ధర్మరాజులకు కూడా కోపమే వస్తే కష్టమే.

ఇంతకూ ఆ తల్లీ కొడుకుల మధ్య వచ్చిన అభిప్రాయ భేదాల పూర్వపరాలెట్టివనిన ఆమెకు కొడుకుతోపాటు యిద్దరు కూతుళ్ళున్నారు. భర్త గతించాడు కూతుర్లిద్దరిలో పెద్దమ్మాయి నలుపు, రెండవ అమ్మాయి తెలుపు. ఎవరొచ్చినా చిన్నమ్మాయినైతే చేసుకుంటామంటున్నారు. పెద్దమ్మాయి నలుపు అన్న కారణంగా ఎవరూ యిష్టపడడం లేదు. పెద్దమ్మాయి పెండ్లి కానిదే చిన్నమ్మాయి సంగతెత్త వద్దంటుంది తల్లి. ఎవరిదైతే నేమి ఒకరి పెండ్లి చేసేస్తె కొంత భారం తగ్గుతుంది కదా అంటాడు కొడుకు. అదీ విషయం.

శ్రీ రాముడు, శ్రీ కృష్ణుడిలాంటి ఆరాధ్యదైవాలు నలుపైనా వారి పూజలకు లోటు లేదు. కాని ఈ కళియుగంలో, అందులోను 20వ శతాబ్దంలో, విశేషించి ఆంధ్రదేశంలో ముఖ్యంగా చదువుకున్న యువకుల్లో నలుపు గురించి ఉన్న దురభిప్రాయాలు చూస్తుంటే అసహ్యం వేస్తుంది. అంటరానితనం కన్నా కూడా ప్రమాదకరం నలుపును ఏవగించుకునేగుణం.

దేశ శీతోష్ణ స్థితిని బట్టి, జాతిని, వారసత్వాన్ని బట్టి పుట్టుకతో వచ్చేవి రంగులు. తెల్లనివన్ని పాలు నల్లనివన్ని నీళ్ళు కానట్లే తెల్లని వారు ఉన్నతులు నల్లని వారు అధములు కారు. మగపిల్లవాన్ని కాక ఆడపిల్లను కన్నందుకు భార్యను నిందించే పాటి మూర్ఖుల్లాంటివారే ఈ రంగు భేదాలు చూపే మూఢులు.

వరకట్న పిశాచుల్లో కూడా కొందరు ఉదారవాదులు బయలుదేరారు. అమ్మాయి ఎర్రగా బుర్రగా ఉంటేచాలు అది మట్టి బుర్రైనా సరే కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటామని ముందుకొస్తున్నారు.

తెల్ల వాళ్ళను దేశం నుండి పారద్రోలినా వాళ్ళ జాతి మీద మనకు మమకారం చావలేదు. ఎంతో అభివృద్ధి చెందిన దేశమని గొప్పలు చెప్పుకువే అమెరికాలో కూడా వర్ణ విచక్షణ పోలేదని యిటీవల లాస్ ఎంజిలిస్‌లో జరిగిన రాడ్నికింగ్ గొడవల పరంపర తెలుపుతుంది.

కొసమెరుపు: మూర్ఖత్వానికి పరాకాష్ట ఫేస్ క్రీములు వాడితే నల్లని ముఖం కూడా మారి తెల్లబడుతుందన్న వ్యాపార ప్రకటనల్ని నమ్మడం.

# ఆగమాగం - గాయిగాయి



''మా ఆయన ఇంట్లో ఉన్నంతసేపు శేర్ పటాకులా టపటపా- టపటపా ప్రేలుతూనే ఉంటాడు. కాలుగాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతూనే ఉంటాడు. పంట చేనులో పడ్డ పశువుల్ని తరిమినట్లు పిల్లలందరినీ ఏదో పనిమీద పరిగెత్తిస్తుంటాడు. ఇక నా సంగతి సరేసరి. ప్రక్క మీది నుంచి లేచింది మొదలు మళ్ళీ బయటికి వెళ్ళే వరకు బండినిలాగే ఎద్దు మీద ముల్లు కర్ర ఆడించినట్లు ఆడిస్తాడు. ఆయన తొడ మీద నిప్పుపడ్డా దులపడానికి నన్నే పిలుస్తాడు. ఆయన గడప దాటితే ఇంట్లో వడగళ్ళు వాన పడి వెలసినట్లుంటుంది'' అంటుందా ఇల్లాలు.

నిజమే యిలాంటి ఆగమాగం గాయిగాయి మనుష్యులు మనకు సమాజంలో ఎందరో కనబడుతుంటారు. వీరు చేసే హడావిడి చూడాల్సిందే. దానివల్ల పని తక్కువ పరేశాన్ ఎక్కువ అవుతుంది. అంతేకాదు వారి మాటలకు ఎదుటివారికి కూడా బి.పి. పెరిగిపోతుంది, ఆలోచన తగ్గిపోతుంది. చివరికి అసలు కార్యక్రమాలు తలక్రిందులౌతాయి.

ఈ హడావిడి రాయుళ్ళ వల్ల ఇంటి నుండి ఇంటర్‌నేషనల్ రాజకీయాల వరకు ప్రభావితమవుతున్నాయి. సద్దాం హుస్సేన్ దుందుడుకుతనం ఇరాక్‌ను సర్వనాశనం చేసింది. అనాలోచితంగా బోఫోర్స్ కేసులో ఎవరో ముక్కుమొగం తెలియని లాయరిచ్చిన నోట్‌ను స్విస్ ప్రభుత్వానికి పంపి తన పదవికే ముప్పు తెచ్చుకున్నాడు మన మాజీ విదేశాంగ మంత్రిగారొకరు. జాతీయ రాజకీయాల్లో నాటి రాజ్‌నారాయణగారి నుండి నేటి రాంజెట్ మలానీ, సుబ్రహ్మణ్యస్వామి వరకు రాష్ట్రంలో నల్లపురెడ్డిగారిలాంటి వారంతా హడావుడి మాష్టర్లే. ప్రొద్దునిచ్చిన ప్రకటన సాయంత్రానికి ఖండించి మరునాటి కల్లా మాటమార్చే రాజకీయవేత్తలు మరికొందరు. తొందర పాటులో అనాలోచితంగా ఎక్కువ మాట్లాడి ఎక్కువ తప్పులు చెప్పి అవి దిద్దుకోలేక నానా అవస్థలు పడడం వీరికి అలవాటు. అందుకే పరుగెత్తి పాలు త్రాగడం కన్నా నిలబడి నీళ్ళు త్రాగమన్నారు పెద్దలు. అంతేకాదు ఒకోసారి మాట వెండైతే మౌనం బంగారమవుతుంది. డబ్బుపోతే సంపాదించుకోవచ్చు, ఆరోగ్యం దెబ్బతింటే బాగు చేయించుకోవచ్చు కాని మాట జారితే వెనకకు తీసుకోలేం కదా!

కొనమెరుపు: ప్రముఖ కవి రచయిత శ్రీ పేర్వారం జగన్నాథం గారు ఒక సాహితీ సమావేశంలో మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో విరసం వాళ్ళదంతా ఆగమాగం-గాయిగాయి పాత్ర అన్నారు.